# ఉత్తరాలు

## శుభాకాంక్షలు!

**మా పాఠకులు, రచయిత (త్రు)లు, ప్రకటన కర్తలు, ఏజంట్లు అందరికీ మా నూతన సంవత్సర శుభాకాంక్షలు -సం.**

### ముఖచిత్రం

18—12—81 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వెలువడిన ముఖచిత్రం నటి అంబిక మమ్మల్నెంతో ఆకర్షించింది.

హమీదాబాను (గుంటూరు)

### సీరియల్

సుహాసిని ముఖ చిత్రంతో వెలువడిన 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' అత్యంత ఆకర్షణీయంగానుంది. 'కోరిక తీరేవేళ' అత్యంత ఆసక్తికరంగా ముగిసింది. 'జీవితంలో కొత్తగాలి' ఉత్సాహకరంగా సాగుతూంది.

సాటూరి రామకృష్ణ, వంగూరు మోహనరావు. (మాగిరి)

*　*　*

4—12—81 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ''కోరిక తీరేవేళ''కు ఇంత త్వరగాముగింపు వస్తుందనుకోలేదు. కె. ఇందిరాదేవి రచించిన ''జీవిత వసంతంలో కొత్తగాలి'' సీరియల్ రసవత్తరంగా ముందుకు సాగుతోంది.

కొండదాడి వెంకటరమణమూర్తి (శ్రీకాకుళం)

*　*　*

11.12.81 ఆంధ్ర సచిత్ర వారపత్రిక నటి సీమ ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా ఉంది. ''జీవిత వసంతంలో కొత్తగాలి' ''తార'' సీరియల్స్ రెండూ చాలా ఇంటరెస్ట్‌గా ఉన్నవి.

ఎస్. నరిసింగరావు (ఖర్గపూర్)

*　*　*

నటి సీమ ముఖ చిత్రంతో వెలువడిన ''ఆంధ్ర సచిత్ర వారపత్రిక''చూడ ముచ్చటగా ఉంది. ''జీవితవసంతంలో కొత్తగాలి'' సీరియల్ చాలా బాగుంది.

ఎం. ఓ. షఫీక్ అహ్మద్, అమ్మాజీ(లాడేపల్లిగూడెం)

*　*　*

'తార' సీరియల్ వెరైటీగా వుంది. రచయిత్రికి నా అభినందనలు.

ప్రభాకరరావు (సిమెంట్‌నగర్)

నటి అంబిక ముఖ చిత్రంతో వెలువడిన 18.12.81 నాటిఆంధ్రపత్రిక ఆకర్షణీయంగా ఉంది.

హజారాగారి క్రొత్త సీరియల్ ''తార'' కొత్తరకంగా వుంది.

ఎస్. ఇందుమతి (హైదరాబాదు)

*　*　*

జీవితవసంతంలో కొత్తగాలి రియల్లీ బెస్ట్
ఇందులో కిరణ్ పాత్ర గ్రేటెస్ట్
సంధ్య పాత్ర స్వీటెస్ట్
అందుకే చదవాలంటే ఇంట్రస్ట్
దానికి కట్టలేము కాస్ట్
ఇది ఇంకా మంచిగా సాగాలని మా రిక్వెస్ట్
మేము మీకు లెటర్ వ్రాయటం ఇదే ఫస్ట్

అంబారే— అనార్కలీ (డొంకరాయి)

### కథలు

ఇప్పుడిప్పుడే తారాపథాన్ని అందుకుంటున్న నటి అంబిక ముఖచిత్రంతో సర్వాంగసుందరంగా వెలువడిన 18—12—81 నాటి వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉంది. ''పెళ్ళిమాపులు'' కథ చాలా బావుంది.

ప్రత్తిపాటి సాంబశివరావు, ముమ్మా వెంకటేశ్వర్లు, చక్రీధర్. (జొరంట్లవారిపాలెం)

*　*　*

18.12.81 సంచికముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా ఉంది. మంజా కథ చాల సహజంగానూ, దేవతా వస్త్రాలు ముగింపు చాల హృందాగాను ఉన్నాయి.

మాచిరాజు సత్యప్రసాద్ (బందరు)

*　*　*

చాలమయ్య పాటకే పం
చాలివారమున కొట్టు శాస్త్రోక్తముగా
శిలమయ దేవతా వ
స్త్రాలు రసజ్ఞ ప్రశంసగ్రక్కసుగొనుడీ

పసుమర్తి చాడేశ్వరీదేవి (ఒంగోలు)

(66 వ పేజీ చూడండి)

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 - 1972]

శుక్రవారం : 8-1-'82
దుర్మతినామ సం. పుష్య శు. చతుర్దశి
సంపుటము 75 : సంచిక 18

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67-60
ఆరు మాసాల చందా రు. 33-80
విడిప్రతి వెల రు. 1-25 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
స్వామి అయ్యప్ప
(చిత్రకారుడు: బాబు)

# శబరిమలై స్వామి శ్రీ అయ్యప్ప

'స్వామియే శరణ మయ్యప్పా' అన్న శరణ ఘోషతో హరిహరాత్మజుడైన అయ్యప్ప స్వామి దర్శనం కోసం శబరిమలై వెళ్ళే యాత్రికుల సంఖ్య ఆంధ్రదేశంలో కూడా ఏఏటికాయేడు వేల సంఖ్యలో పెరుగుతున్న విషయం అందరికీ తెలిసినదే.

శివ కేశవుల కలయికతో ఆవిర్భవించిన మహా శక్తి స్వరూపుడే స్వామి అయ్యప్ప. మహిషి అనే లోక కంటకురాలైన రాక్షసిని సంహరించడానికి అవతరించిన కారణజన్ముడు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ కోసం ఆవిర్భవించిన ధర్మశాస్త్ర కలియుగాంతంవరకూ శబరిమలైలో మకర జ్యోతిగా లక్షలాది భక్తులకు ప్రత్యక్ష నిదర్శనంగా కన్పించే రోజు, మకర సంక్రాంతి, ఈ భూతనాథుని పుట్టినరోజు.

ఆ రోజున జరిగే మహోత్సవంలో స్వామి అలంకరణకి పంతళ రాజ వంశీయులనాడు స్వామికి కానుకగా యిచ్చిన అమూల్యాభరణాలు ప్రభుత్వ సిబ్బంది గట్టి బందోబస్తుతో స్వామి సన్నిధికి తీసుకువస్తారు. ప్రతి ఏటా అవి తెస్తున్నప్పుడు దారి పొడవునా ఆకాశ మార్గంలో ఓ గద్ద ఆభరణాలు స్వామి సన్నిధిక చేరేవరకూ అనుసరించి వస్తూ ఉంటుంది. స్వామి మహిమకి ఇదొక నిదర్శనంగా చెప్తారు.

శబరిమలైలోని అయ్యప్పస్వామి దేవాలయంలో ద్వారం తూరువైపుకి ఉంటుంది. దానికి ఉన్న పద్దెనిమిది మెట్లూ పంచేంద్రియాలు, అష్టరాగాలు, మూడు తమో గుణాలు, విద్యా అవిద్యలకి సంకేతాలు. ఏడాదికొకటిగా పద్దెనిమిది ఏళ్ళలో వాటిని వ్రత నియమంతో జయించినవారికి మోక్షం లభిస్తుందని అంటారు.

ఇలా ప్రతి సంవత్సరం వ్రత నియమంతో ఒక్కో మెట్టుపై ఒక్కో కొబ్బరికాయ కొడుతూ పద్దెనిమిదేళ్ళ స్వామిని అర్చించిన వారికి ఐహిక ఆముష్మిక సుఖాలతో మోక్ష ప్రాప్తి కలుగుతుంది. నియమరహితంగా స్వామిని సేవించడం నిష్ఫలం.

శబరిగిరిపై గర్భాలయంలో స్వామి విగ్రహం కూర్చున్నట్టుగా ఉంటుంది. కుడిచేతి అభయ హస్తంలో చిన్ముద్ర. బొటనవేలు పరమాత్మకి, చూపుడువేలు జీవాత్మకి, చివరి మూడు వేళ్ళూ మూడు కర్మలకీ ప్రతీకలు. ఎడమచేయి భక్తులకి స్వామి చరణాలని చూపిస్తూ వుంటుంది. యోగపట్టం చుట్టి ఉంటుంది స్వామి పాదాలు దర్శించడానికి వీలుగా ఉంటాయి. ఈ విగ్రహాన్ని పరశురాముడు నిర్మించాడని ప్రతీతి.

శబరిమలై యాత్రకు వెళ్ళే భక్తులు మకర సంక్రాంతికి 41 రోజులు ముందే భక్తి శ్రద్ధలతో గురువు ద్వారా మాలని స్వీకరించి ధరించాలి. ఈ దీక్షా కాలంలో సత్కార్యాచరణ, సచ్ఛీలత కల్గి బ్రహ్మచర్యాన్ని పాటించాలి శరణ ఘోష చేస్తూ ఉండాలి. ''వయసులో ఉన్న ఆడవారు'' ఈ యాత్రకి అర్హులు కారు.

శబరిమలై స్వామిని దర్శించడానికి భయంకరమైన అడవుల్లో కాలిబాటన దాదాపు 48 మైళ్ళు నడవాల్సి ఉంటుంది. కాని భక్తులకి ఏ మాత్రం శ్రమ అనిపించక పోవటం గొప్ప విశేషం. దక్షిణ గంగ అయిన పంపానదిలో స్నానం భక్తుల్ని పునీతుల్ని చేస్తుంది. అనంతరం వారు స్వామి దర్శనం చేసుకుంటారు.

శబరిమలై వెళ్ళే ప్రతి భక్తుని తలపై ఇరుముడి తప్పనిసరిగా ఉండాలి గురువు సమక్షంలో దీన్ని కట్టుకోవాల్సి ఉంటుంది. ఇది రెండు అరల సంచి లాంటిది. ముందు వైపు స్వామి సేవకి తీసికెళ్ళే అర్చన సామగ్రిని, వెనుక వైపు భక్తునికి మార్గంలో కావలసిన తినుబండారాలు మొదలైనవి ఉంటాయి.

ఇన్ని కఠోర నియమాలతో కూడిన దీక్షతో, అచంచల ఆత్మ విశ్వాసంతో, ప్రగాఢమైన భక్తి ప్రపత్తులతో దిక్కులు మార్మోగేలా చేసే శరణ ఘోష భక్తులకే కాక విన్న ప్రతివారి హృదయంలో అనిర్వచనీయమైన ఆనందానుభూతిని, గగుర్పాటుని కలిగిస్తుంది.

'స్వామి శరణం అయ్యప్ప శరణమ్'అంటూ శబరిమలై వాసుని దివ్య సందర్శనార్థం భక్తితో దేశం నలు మూలల నించీ వెళ్ళే భక్తులు ఏఏటికాయేడు లక్షల సంఖ్యలో పెరుగుతున్నదంటే దానికి కారణం ఆయన మహిమలేనని చెప్పవలసి ఉంటుంది.

— ఎమ్మార్



దీక్ష కాలంలో తమ యిళ్ళలో స్వామివారికి పూజలు, భజనలు చేస్తున్న భక్తులు.

పెద్దకథ

# బిళ్ళలేని తెల్లటోపీ

కన్నబాబు

(గత సంచిక తరువాయి)

మర్నాడు పాసింజరు బండి వెళ్ళిపోగానే గోపాలంపంతులు గొడుగు ప్లాట్‌ఫారాన్ని తుడిచి శుభ్రంచేసింది, చిన్నమెష్ను గదినిదూరం నుండే ఓసారిచూసి సంతోషపడ్డాడు. ప్లాట్ అంచున నిలబడి అటువక్క వెనకాముందూ అవుతున్న షంటింగు బండి వేపు చూపుని పోనిచ్చాడు. ఇంతలో "చా తీసుకోపంతులూ" అని టీ కుర్రాడు పక్కనుండి అనగానే ఇంకా బండివేపే చూస్తూ చెయ్యి జాచాడు గోపాలం పంతులు. చాచిన చేతికి కప్పు తగల్లేదు. టీ కుర్రాడి వేపు తిరిగాడు. ఒకచేత్తో కెటిలూ, మరోచేత్తో కప్పుల బకెటూ పట్టుకున్న టీ కుర్రాడు గాభరాగా స్టాల్ వేపు వెళిపోతున్నాడు. ఎదురుగా స్టాల్ కిటికీలోంచి చూస్తున్నాడు వెంకయ్య టీ కుర్రాడి వేపూ, గోపాలంపంతులు వేపున్నూ. గోపాలంపంతులుకి ఇదేదీ బోధపడలేదు. కానీ టీ కుర్రాళందరికీ ఆ విషయం బాగా తెలుసు. వెంకయ్య అక్కేపు ఆ విధంగా చూసాడంటే వారి కూడ వేలు కూలిపోవల్సిందే వెంకయ్య రక్తం మరిగి కళ్ళలోంచి ఆవిర్లు వస్తాయి. ఆ చూపుతో ఎదుటి మనిషి గుండెకాయ లోని నెత్తురు అక్కడికక్కడే గడ్డకట్టుకుపోతుంది.

పరధ్యానంగా రెండుమూడు సార్లు ప్లాట్‌ఫారం మీద పచారు చేసాక గోపాలం పంతులు దక్షిణ చివర స్టేషనుపేరు రాసిన సిమెంటు బల్ల నీడలో నిలబడి డిస్టెంటు సిగ్నలు వేపు చూసాడు. ఉన్న ఆ కాస్తపాటి ఊపిరినీ ఆవిరిగా జారవిడుచుకుంటున్న భయంతో ఒక్కచిక్కి సన్నటి కాలవల్లాగా కనపడ్డాయి, ఎండ వేడికి ఉడికిపోతున్న రైలుపట్టాలు.

దగ్గర్లోనే ప్లాట్‌ఫారం కింద మొదటి రెండు లైన్లకి మధ్యగా మూడున్నరకాళ్ళ కుక్క ఒకటి కుంటుకుంటూ స్టేషనుకి గస్తీ కాస్తున్నాది. బండి చక్రం కింద కాలు విరక్కొట్టుకున్న తప్పు తనదే అని సమాధాన పరుచుకున్నదేమో, కాలు తెగినా స్టేషనుమీద మోహాన్ని మాత్రం తెంపుకోలేకపోయిందా కుక్క. గోపాలం పంతులు వెనక్కి వచ్చి ప్రవేశద్వారానికి ఎదురుగా నిలబడి దృష్టిని మొక్కల మీదికి పోనిచ్చాడు గులాబిమొక్కలు — కాదు గులాబి మోళ్ళు — ముళ్ళనే కాస్తున్నాయి. క్రోటన్సు కిళ్లీ ఉమ్ముల బరువుతో తలెత్తి గోపాలంపంతుల్ని చూడలేకపోయాయి. పూలమొక్కలన్నీ గొడ్డుబోయి దీనంగా చూసాయి అతనివేపు. ఒక్క బోగన్విల్లా మాత్రం ఆనందంగా చల్లటి పిల్లగాలి జల్లును ఎర్రటి పువ్వుల్లోంచి అతని మీదికి మృదువుగా విసిరింది. విచ్చిన వేసుకొని స్టేషను పెంకు మీదికి ఎక్కించి దుమ్ములకు దూరంగా ఉంచినందుకు కృతజ్ఞతలు తెలుపుతున్నట్టు. కళ్ళు మరీ పెద్దవి చేసుకొని బోగన్విల్లా ఎర్రటి అందాన్ని రెప్పల్తోనే చప్పరించసాగాడు గోపాలంపంతులు. ఆనందంగా ఆ బోగన్విల్లా కుండికి పక్కన టిక్కెట్టు కలక్టర్ గదికి ముందు కర్రబెంచీ మీద ఇజ్జాగరం చెట్టు నీడలో కూచొని ఎదురుగా షంటింగు బండివేపు చూసాడు.

షంటింగు బండి అడ్డురానప్పుడు లైన్లకి అవతలవేపున్న గుడ్సుషెడ్డూ, దానిగోడమీద పెద్ద అక్షరాలతో అక్కడ పొగతాగకూడదని ఇంగ్లీషులోనూ తెలుగులోనూ రాసిన హెచ్చరికా, అక్కడే బీడీలు కాలుస్తూ సామాన్లు బళ్ళకి ఎత్తుతున్న కళాసీలూ— యీ దృశ్యాల్ని చూస్తున్నాడు గోపాలం పంతులు ఇంతలో షంటింగు బండి మళ్ళీ ముందుకి వచ్చింది గుడ్సుషెడ్డు దృశ్యం మరుగున పడింది. మాసిపోయిన ఎరుపు రంగులో కొన్నీ, వెలవెల బోతున్న నలుపు రంగులో కొన్నీ ఉన్నాయి షంటింగు బండి పెట్టెలు. అన్ని పెట్టెలకీ హోస్ పైపులు రెండు వేపులా వేలాడుతూ ఉన్నాయి. కప్లింగు గొలుసులు మాత్రం ప్రతి పెట్టెకీ ఒక్కవేపే వేలాడుతున్నాయి. బండి వెనకా ముందూ అవుతున్నప్పుడు వాటి ఊగులాట అందని ఈగల్ని వీపుమీంచి తోలుకోడానికి తోకల్ని ఎగరేస్తున్న గేదెల బాధను గుర్తు చేస్తున్నాయి. ఆ షంటింగు బండివేపే చూస్తూ, చేసేందుకు మరోపని లేకపోడం వల్ల, పెట్టెల నెంబర్లు ఒక్కటొక్కటీ మనసులో చదువుకుంటున్నాడు గోపాలం పంతులు— ఇ. ఐ. 68100, బి. ఎన్. 10094, ఇ బి. 17704, జి ఐ. పి. 118421, ఎస్.ఎస్.ఎమ్. 10117— యీ విధంగా వాటి నెంబర్లు చదువుకుంటూ నిలిచివున్న పెట్టెల వరసని విసురుకొస్తున్న పెట్టె 'ధన్సు'మని గుద్దినప్పుడు పెట్టెల వరస ఎన్ని అడుగులు ముందుకు తోసుకుపోయి ఉంటుందో, కొత్తగా వచ్చిన పెట్టె మళ్ళీ ఎన్ని గజాలు వెనక్కివెళ్ళి ఉంటుందో మనసులోనే అంచనాలు కట్టుకుంటున్నాడు. కొత్తగా వచ్చిన పెట్టెకి వరస పెట్టెల్లోని చివరిదాని కప్లింగు గొలుసు తగిలించి, షంటింగు బండి చివరి పెట్టె వెనక చక్రం

పైన వున్న పలచని ఇనప బద్దీమీద నిడం పాదం సగం మోపి, ఎడట ఇనప గొండెం లాటిదాన్ని నిడంచేత్తో పట్టుకున్నాడు పాయింట్సుమన్ వీరయ్య. కుడికాలు గాలిలో ఆడిస్తూ కుడిచేత్తో పచ్చజెండా ఊపగానే బండి మళ్ళీ వెనక్కి వెళ్ళింది. పాయింట్సు దాటగానే ఎర్రజెండా చూపించి, ఇంకా నడుస్తూనే ఉన్న బండిమీంచి దూకి, 'బారానెంబర్' అని జోరుగా అరిచాడు సౌతు కేబిను వేపు చూస్తూ కేబిను జెమెదారులైను మార్చగానే పచ్చజెండా తిరిగి చూపించాడు వీరయ్య ఇనప గొలుసుల బస్తాలను మోసుకుపోతున్నట్టు గణ గణ గణా చప్పుడు మోతతో ఇంజను షంటింగు బండీని మళ్ళీ ముందుకు తీసుకుపోయింది. ఆ పెట్టెల ముందు పిట్టలాగ కనబడుతున్న వీరయ్య సాహసం మనకి భయంగానూ, ఆశ్చర్యంగానూ వుండొచ్చుగాని గోపాలం పంతులుకి మాత్రం మహా ఆనందాన్ని ఇస్తున్నాది వరస పెట్టెల చివరి రెండుపట్టాలకి మధ్యగా నిలబడి విసురుకొస్తున్న పెట్టె వచ్చిరావడంతో దాని కొక్కానికి ఇవతల పెట్టె కపింగు గొలుసును వీరయ్య తగిలించి నప్పుడు 'షబాష్' అని మెచ్చుకుంటున్నట్టు చిన్న ఆనందం ప్రదర్శించాడు గోపాలం పంతులు. భాషలేని శబ్దాలకీ, చూపులకీ అందని సాహస కార్యాలకీ అర్థం చెప్పేది అనుభవమే. ఇటువంటి విషయాల్లో కూడా ఏ వీరయ్యకూ తీసిపోని అనుభవం గల గోపాలంపంతులికి ఆ చప్పుళ్ళూ, దృశ్యాలూ మహదానందాన్ని కలిగిస్తున్నాయి. అంతటి ఆనందంలో మునిగితేలుతున్న గోపాలంపంతుల్ని టిక్కెట్టుకలెక్టరు కె.వి. రావుపలకరింపుమళ్ళీ మన ఒడ్డుకి తెచ్చింది. ''గోయింగ్ హోమా?'' అని చిరునవ్వుతో తిరిగి పలకరించాడు గోపాలంపంతులు, డ్యూటీ అయిపోయి ఇంటికే వెళ్ళిపోతున్నాడని తెలిసినా. ''గోయింగ్ హోమేనండీ'' అంటూ టి. సి. కె వి. రావు ఖాళీటిఫిన్ కారియరు ఆడించుకుంటూ గేటు మళ్ళాడు.

గోపాలం పంతులు శూన్యంగా గేటువేపే అలా కాస్సేపు చూసాక, కె. వి రావుకి రిలీవరు ఎవరో చూద్దామని టి. సి. ల గదికి వెళ్ళాడు. ''వాడ్డూయూ వాంట్ ?'' కటువుగా వినిపించింది ఓ కొత్త గొంతు. 'కె. వి. రావుకి రిలీవరువా ?'' ఆప్యాయంగా అడిగాడు గోపాలంపంతులు. కె.వి. రావుకి రిలీవర్ని, వాడమ్మమొగుణ్ణి మీకెందుకుసార్, మీపనేదో మీరు చూసుకోండి'' అతని వాలకం, మాట తీరూ ఇంకా ఉద్యోగ లక్షణాలకి అలవాటు పడలేదు నోరు మెదపకుండ వెనక్కి వెళ్ళి, మళ్ళీ ఆ బెంచీ మీదే కూల



బడ్డాడు గోపాలంపంతులు, నల్లటోపీని తీసి ఒళ్ళో పెట్టుకుంటూ.

మెయిలుబండి మరో గంటకి గాని రాదు. షంటింగు బండి ఎందుకో నిలబడిపోయింది, గుడ్సుషెడ్డుకి అడ్డుగా. ఆ షంటింగు బండి పెట్టెల నెంబర్లు చదివినవే మళ్ళీ చదివాడు గోపాలంపంతులు. అతికష్టం మీద ఓ పావుగంట గడిచింది. ఇక గొడుక్కి పనిచెప్తే బాగుంటుందనుకున్నాడు. అతని పని పూర్తి అయ్యేసరికి ప్రయాణీకుల రాక ప్రారంభ మయింది. తరగతుల వారీగా తగినచోట్ల సామాన్లు దింపుకుంటున్నారు లైసెన్సు కూలీలు. ఎందుకో ఆ రోజు ఎడతెరిపిలేకుండ వచ్చేస్తున్నారు జనం. అంతమందిని ప్లాట్ ఫారం మీద ఎప్పుడూ చూడలేదు గోపాలం పంతులు. అందులో కొందరు ప్రయాణీకులు కారన్న సంగతి అతనికీ తెలుసు అయినా అంతమంది జనం! ఇసకవేస్తే రాలనంత మంది జనం! ఇంకా వచ్చేస్తూనేఉన్న జనం! గోపాలం పంతులు ఆశ్చర్యపోయాడు. ఖద్దరు పంచలూ, కళ్ళజోళ్ళూ, జరీకండువలూ, చేతుల్లో నల్లని తోలు సంచులూ వీళ్ళ సంఖ్యే యెక్కువ

మెయిలు బండికి లైను క్లియరు గంట మోగింది. జనం ఇంకా వచ్చేస్తూనేవున్నారు. తోపులాటకి పిల్లల యేడ్పులు, వాళ్ళని ఎత్తుకొని ఓదారుస్తున్నారు తల్లులు. సామాన్లమీదే మొగాళ్ళి అతికారు మొగాళ్ళు. ఎందుకైనా మంచిదని చిన్నతరగతి నస్తువుల్ని చేతుల్లోకి తీసుకున్నారు తాతలూ అమ్మమ్మలూ. మెయిలు అవుట గంట మోగింది. ఎక్కడెక్కడో తచ్చాడుతున్న లైసెన్సు కూలీలు అరిగిన చట్టలూ, గోడీలూ చెవులకి తగిలించి సామాన్ల దగ్గరికి చేరుకొనే

## బళ్ళ లేని నల్లటోపీ

లోగా బండి స్టైటు గంట మోగిపోయింది. ఇంతలో రానేవచ్చేసింది పులిబొబ్బ వేసుకుంటూ మెయిలుబండి. రైలు టైముకే వచ్చింది - జేబులోంచి వాచీ తీసి నిర్ధారణ చేసుకున్నాడు గోపాలంపంతులు, ఆనందంగా. ప్రయాణీకులు కూలివాళ్ళ వెనక అడుగులు జోరుగా వేస్తున్నారు - స్థలం వున్న పెట్టెలు వెదుక్కుంటూ. దిగవలసిన ప్రయాణీకులు దిగిపోయారు. వెళ్ళవలసిన వాళ్ళు ఎలాగో మొత్తంమీద బండిలో సర్దుకుపోయారు. అయినా ప్లాట్‌ఫారం జనాభాలో చెప్పుకోతగ్గ మార్పు కనిపించలేదు. మార్పల్లా ఒక్కటే - జనం అంతా అదిగో ఆ ఫస్టుక్లాసు వెయిటింగు రూము వేపే తోసుకుపోతున్నారు. గదిలోపలికి వెళ్ళడానికి తోపులాట గోపాలం పంతులుకి యీ గోల అస్సలు నచ్చలేదు. చికాకుపడ్డాడు. చివరికి చీదరించుకున్నాడు గొడుగు ఆడించుకుంటూ బండి ఆ చివరి నుండి యీ చివర వరకూ ఓ చెక్కరు కొట్టాడు "హలో, పాల్" అన్నాడు డ్రైవరు "హవ్‌యూ?" అడిగాడు గోపాలం పంతులు. "హలో, చారీ" పలకరించాడు గోపాలంపంతులు - ఉమ్మచుట్టిన పచ్చజెండా ఓ చేత్తో పట్టుకొని మరోచేత్తో నిగనిగ మెరిసిపోతున్న విసిలు పట్టుకున్న గార్డు నుద్దేశించి. "హలో, పాల్. నైస్‌టు సీయూ ఎగెయిన్" అన్నాడు గార్డు.

టైంటేబిలు పుస్తకం ప్రకారం మెయిలు బండి పదినిమిషాలే ఆగుతుంది మా వూళ్ళో. ఇక ఏ క్షణాన్నయినా బండి కదలొచ్చు. సిగ్నలు కూడ వాలింది. గోపాలంపంతులూ గార్డూ ఇంగ్లీషులో పాతరోజులు ముచ్చటించుకుంటున్నారు. ఉండుండి ఆశగా గార్డు సౌతు కేబిను వేపు చూస్తున్నాడు. గంట కొట్టడమే తరువాయి, బండి కదిలిపోతుంది. కాని గంట మాత్రం ఏంచేతో ఇంకా మోగలేదు. పదినిమిషాల పైని మరో అయిదు నిమిషాలు గడిచాయి - జేబులోంచి వాచీ తీసి చూసుకున్నాడు గోపాలంపంతులు. "ఐ విల్ ఫయిండవుట్" అంటూ గబగబా చిన్నమేష్టు గదికి దారి తీసాడు. ఈ ఆలస్యానికి తాను ఏ మాత్రమూ బాధ్యుడు కాదన్నట్లుగా ద్వారానికి మధ్యగా నిలబడి, చిన్నగా నవ్వుతూ అన్నాడు చిన్న





# చేతివృత్తుల వారికి చేయూత



శ్రీమతి ఇందిరాగాంధి
ప్రధానమంత్రి



శ్రీ టి. అంజయ్య
ముఖ్యమంత్రి

★ ఆంధ్రప్రదేశ్‌లో తయారయ్యే బిద్రి వస్తువులు, నిర్మల్ పెయింట్సు కొండపల్లి బొమ్మలు, కలంకారి, క్రెచేట్ లేసులు, ఇత్తడి వస్తువులు, అత్తరులు, రాళ్ళు పొదిగిన గాజులు వంటి చేతి వృత్తుల ఉత్పత్తులకు ఒక ప్రత్యేక స్థానమున్నది.

★ ఈ చేతి వృత్తులపై ఆధారపడి సుమారు 65,000 మంది జీవిస్తున్నారు. రాష్ట్రంలో చేతి వృత్తులను ప్రోత్సహించేందుకోసం రూ. 2 కోట్ల పెట్టుబడితో చేతి వృత్తుల అభివృద్ధి సంస్థను ఏర్పాటు చేశారు. చేతి వృత్తులు అభివృద్ధి పరిచేందుకు అవసరమయ్యే శిక్షణ, పరిశోధన, డిజైనింగు మార్కెట్ సౌకర్యాలు వంటి అవసరాలు తీర్చేందుకు ఈ సంస్థ దోహదకారిగా ఉన్నది.

★ రాష్ట్రంలో చేతి వృత్తులపై ఆధారపడి జీవించే వారి ప్రయోజనంకోసం బృహత్తర కార్యక్రమాలు రూపొందిస్తున్నారు. ప్రతి పంచాయతీ సమితిలోనూ చేతి వృత్తుల సముదాయాన్ని ఏర్పాటు చేస్తారు. వీరి శిక్షణ, వస్తువుల తయారీ అవసరాలను ఈ సముదాయాలు తీరుస్తాయి. వీటితోపాటు, గ్రామీణ చేతి వృత్తుల వారికి నివాసంగాను, కార్యస్థానాలుగాను ఉండే భవనాలను ఎంపిక చేసిన గ్రామాలలో నిర్మిస్తారు. తగిన యంత్ర సౌకర్యాలతో సామూహిక సౌకర్య కేంద్రాలు ఏర్పరచి, వీరికి ఆధునిక పరికరాలు సమకూరుస్తారు.

★ చేతి వృత్తుల వారికోసం ప్రత్యేకంగా ప్రతి జిల్లాకు కనీసం ఒక చిన్న పారిశ్రామిక వాడను ఏర్పాటు చేస్తారు.

★ పీచుతో వస్తువులు తయారు చేయడంలో సుమారు 800 మందికి శిక్షణ ఇస్తారు. తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, శ్రీకాకుళం జిల్లాలలో 21 సహకార సంఘాలు ఇందుకోసం ఏర్పాటు చేస్తారు. రాష్ట్రంలో పీచుతో రూ. 470 లక్షల విలువచేసే వస్తువులు తయారవుతాయని అంచనా.

★ రాష్ట్రంలో ప్రస్తుతం మొత్తం రూ. 5532 లక్షల పెట్టుబడితో 37,301 చేతి వృత్తుల యూనిట్లు 71,293 మంది వ్యక్తులకు ఉపాధి కల్పిస్తున్నాయి.

★ గత రెండు దశాబ్దాలుగా ఖాదీ, గ్రామీణ పరిశ్రమల మండలి 60,000 మందికి పైగా గ్రామీణ చేతి వృత్తుల వారికి సహాయం అందజేసింది. గ్రామాల దత్తత పథకం క్రింద ఈ సంస్థ 149 గ్రామాలను దత్తత తీసుకుని, బ్యాంకులు ఇచ్చిన మొత్తంతోసహా రూ. 34 లక్షల మొత్తాన్ని 3160 మంది చేతివృత్తుల వారికి సహాయం అందజేసింది.

★ సబ్బులు, ఫేము, తోళ్ళ పీచు మొదలైన వాటితో వస్తువులు తయారు చేయడం ద్వారా 300 యూనిట్లలో 2,400 మందికి ఉపాధి కల్పించాలని తలపెట్టారు.

చేతి వృత్తులు, గ్రామీణ పరిశ్రమలు అభివృద్ధి పరిచేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేయూత నిస్తున్నది.

Advt - No. 54

సమాచార పౌర సంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాదు. DIPR No. 52428/Advt-1/C3/81

మేష్ను; "రోజులు మారాయి సార్". పెద్ద మేష్ను గదిలోకి వెళ్లాడు గోపాలంపంతులు. గదిలో ఎవరూ లేరు. ప్లాట్‌ఫారంమీద అతని అయిపు అసలే లేదు. ఇంజను దగ్గరికి వెళ్లి "వాటీస్ది ప్రోబ్లమ్, జాన్?" ప్రశ్నించాడు

## బిళ్లలేని నల్లటోపీ

డ్రైవర్ని "నత్తింగ్. ది బడీ బ్రెయిన్ వాంట్స్ ఫర్ సమ్ ఎగ్స్. సో ఐ సెంట్ ది బ్లడీ ఖలాసీ టు గెట్ సమ్ ముర్గీకా అండా, పాల్" అన్నాడు డ్రైవరు. ఏమిటీ! కోడిగుడ్లకోసం మెయిలు బండి ఆగిపోయిందా! గుడ్లు పెద్దవిచేసి ప్రశ్నార్థంగా చూశాడు గోపాలం పంతులు. "నో, పాల్. ఐ న్యూ ది బ్లడీ బ్రెయిన్ వోంట్ స్టార్ట్ అన్ ఎగ్స్.

సో ఐ సెంట్ ది బ్లడీ ఖలాసి ఫర్ ది బ్లడీ అండా'' అన్నాడు, బండి ఆలస్యానికి తానూ అనుభవిస్తున్న చిరాకును ప్రదర్శిస్తూ. ఇంతలో బుల్లోడు కోడిగుడ్లు పట్టుకొచ్చాడు ఖలాసి షహ బండి బయల్దేరుతుందని ఆశించాడు గోపాలంపంతులు. లేదు. బండి బయల్దేరలేదు. గంట ఇంకా మోగలేదు. జేబులోంచి వాచీ మళ్ళీ తీసి చూసాడు. లేటు పావుగంట వరకూ ఎదిగింది. నల్లటోపీ తీసి బట్టతలమీద చెమటని పంచతో తుడుచుకుంటూ గార్డు దగ్గరికి పరుగులు తీసాడు. అప్పుడే అటు సౌతు కేబిను వేపునుండి ఉరకలు తీస్తూ వచ్చిన మీరయ్య కోడిగుడ్లు బుట్ట గార్డుకి అందించాడు. డ్రైవరుకీ, గార్డుకీ కోడి గుడ్లు కావాలని మెయిలుబండి ఆగిపోవాలా! చురచురా చూసాడు. మరైతే ఇంకా బయల్దేరదేం బండి? ''వై డోంట్యూ బ్లో ది బ్లడి విసిల్ ? లుకెట్మి వాచ్'' జేబులోని వాచీని చూపిస్తూ గర్జించాడు గోపాలం పంతులు. ''ఐ కాంట్, అన్టిల్ దట్ బ్లడి జెమెదార్ రింగ్స్ ది బ్లడి బెల్'' అన్నాడు గార్డు, తెల్లటి జేబురుమాలుతో ఎర్రబారిన ముక్కును తుడుచుకుంటూ. గడ్డిపోచవంటి ఆఖరు ఆయుధాన్ని కూడా ప్రయోగించేసిన గోపాలంపంతులుకీ ఇప్పుడేం చెయ్యాలో తోచక వాచీ మీదే చూపును తాపేడు. ఆ చివరనుండి నల్లటోపీతో డ్రైవరు ఇంజన్లోంచి వంగి గార్డు వేపు చూస్తున్నాడు. గార్డు జనంవేపూ, ఆ ఫస్టు క్లాసు వెయిటింగు రూము వేపూ చూస్తున్నాడు. గోపాలం పంతులు కళ్ళు వాచీ సెకండ్ల ముల్లును వెంటాడుతున్నాయి. లేటు అరగంటకి పెరిగింది. ఇంతలో లావుపాటి బొజ్జా, తాటిటెంక తలకాయమీద బోర్లించిన కాగితం పడవలాటి దాన్నేదో పెట్టుకున్న కాయాన్నొక దానిని వెదురు బొంగుల్లాటి కాళ్ళు రెండు ఒగరుస్తూ మోసుకొచ్చి ఫస్టుక్లాసు పెట్టె ఎక్కించాయి ''జిందాబాద్, జిందాబాద్, జై, జై'' అరుపుల బృందగానంతో. ఆ అరుపులకి ప్లాట్‌ఫారం దద్దరిల్లిపోయింది. తక్షణం గంట మోగిపోయింది. గార్డు విసిలు ఊదుకుపోయింది పచ్చజెండా రెపరెపలాడిపోయింది. బకాసురుడెవడో బలంగా వెనకనుండి ఒక్క తాపు తన్నినట్టు మ్రోమని కేకవేసి ఆవిర్లు కక్కుకుంటూ పరుగులు తీసింది బండి. ఈ హడావుడికి గోపాలం పంతులు కాలమానం తిరిగి వర్తమానంలోకి వచ్చింది

బండి వెళ్ళిపోయినా వందలకొద్దీ జనం గుంపులు గుంపులుగా ప్లాట్‌ఫారం మీదే ఇంకా తచ్చాడుతున్నారు. నవ్వుకుంటున్న వాళ్ళూ, గంభీరంగా ఉన్నవాళ్ళూ, కంటతడి పెట్టిన వాళ్ళూ, వాళ్ళని చూసి నవ్వుకుంటున్నవాళ్ళూ, కేవలం గోళ్ళు గిల్లుకుంటున్నవాళ్ళూ– యీ విధంగా ఉన్నారు జనం. వీళ్ళంతా పోతేనేగాని ప్లాట్‌ఫారం తుడవటం జరగదు. అప్పుడుగాని ఇంటికి పోడు గోపాలం పంతులు.

సాయంత్రం ఏడు దాటింది జనవంతా బయటికి వెళ్ళేసరికి. గోపాలంపంతులూ, గొడుగూ గబగబా తమపని ముగించుకున్నారు. అతను గేటు దాటుతూ వుంటే పలవరించాడు జగన్నాధ మహాపాత్రో– ''కాగితం ముక్కుచ్చుకోడానికిక్కాడ సావకాసం నేకపోనాది మినిట్టరు బాబుకి. తెల్లోళ్ళెల్లిపోతే రావరాజ్యం వత్తదన్నారు. ఇది రాబందుల రాజ్జం నాగుందేగాని...''

''ఏంవిటోయ్ పాత్రుడూ, వీలో నువ్వే మాట్లాడేసుకుంటున్నావ్ ?'' అడిగాడు గోపాలంపంతులు.

''మినిట్టరుబాబుని సూడ్డానికొచ్చినావేటి నువ్వుకూడానూ, గోపాలంపంతులూ ?''

''మినిష్టరా !''

''నీకు తెల్దేటి ? మర్నేకపోతే వుత్తపున్నానికే ఆపేసినారనుకున్నవేటి, మెయిలు బండినీ? యింపార్టెంటు నాయకోల్లు మన కట్టాసూకాలు యినరంగా నప్పాలంటే వనిదిమిసిలేటి సాలుద్ది! గాని, గోపాలంపంతులూ, మన కట్టాసూకాలంటే ఆ నాయకోల్నగోరికట్టాసుకాలే నుమీ! ఆ సంగతి యిప్పుడు అరదవయింది నాకు, బాగానే అరదవయిందిలే. యింతకూ రోజులు మారిపోనై పంతులూ'' అంటూ చేతిలో కాగితాన్ని చించిపారేసి, పాత మర్రిచెట్టు వేపు తిరిగి వాళ్ళ గ్రామం దారి పట్టాడు జగన్నాధ మహాపాత్రో.

అడపాతడపా వింటున్నా ఇంతవరకూ చెవిని పట్టని యీ ''రోజులు మారాయి'' ప్రయోగం ఇప్పుడు బ్రహ్మాస్త్రంలాగా పని చేసింది గోపాలంపంతులు మీద. ఆ పదాలనే నెమరువేసుకుంటూ బరువుగా ఇంటిముఖం పట్టాడు. దార్లో ఎక్కడా ఆగకపోయినా ఇల్లు చేరుకునేసరికి మామ్మూలు తొమ్మిదిన్నరా అయింది. దారి పొగుడునా అడుగులకన్న బరువుగా గుండెకాయ లయ కొట్టింది. అంతకన్న మరీ బరువుగా, జోరుగా ''రోజులు మారాయి'' ప్రయోగం సుడులు తిప్పింది. కాని అసలుబాధ మెయిలు బండి అరగంట ఆగిపోయినందుకే. గార్డెన్ రీచ్‌లో వాళ్ళు ఏమంటారో! అన్నా అనకపోయినా బండి అరగంటఆగిపోవడమేంటి? తన ముప్పైయ్యేళ్ళ రైల్వే జీవితంలో ఇటువంటిది ఎప్పుడైనా జరిగిందా! అతగాడు మినిష్టరే అవ్వొచ్చు; అంతకన్న పెద్దదొరే అవ్వొచ్చు. ఆ పాటి దొరలు పూర్వం రాలేదా! వాళ్ళకోసం మెయిలు బండి అరగంట, కాదు అయిదు నిమిషాలైనా ఆగిపోయిందా ? ప్రయాణీకులకి



**వనితలకు మనవి**

కొత్తరకం వంటలు
స్పష్టంగా రాసి పంపితే
త్వరగా పరిశీలించ వీలవుతుంది —సం.



# బిళ్ళలేని నల్లటోపీ

ఇబ్బంది కలిగిందా! రోజులు మారడం అంటే ఇదా? ఈ మాటకి అర్థం పర్థం లేదనుకున్నాడు. అయితే మార్పు ఏదో వచ్చిందని మాత్రం అనుమానం లేకుండా తెలుసుకున్నాడు, గోపాలంపంతులు ఆ రోజు కాని ఆ మార్పుకీ రోజులకీ ఉన్న సంబంధం ఏమిటో — అది మాత్రం బోధపడలేదు. "రోజులు మారవ్, ఇంకేదో, ఎక్కడో మారి వుంటుంది" అని అనుకున్నాడు. అవును. ఒకేరోజా రోజూ వుంటుందా? రోజులన్నీ ఒక్కలాగు వుంటాయా? అవి మారుతూనే వుంటాయి. అందులో విశేషమేవుందని! సూర్యుడు పశ్చిమాన్న ఉదయిస్తే అది మార్పు అలాటిదేదీ జరగలేదే మరి. ఛ, ఛ, యీ "రోజులు మారాయి." అన్న మాటలకి అర్థంలేదు అర్థం లేదనే నిశ్చయించుకున్నాడు గోపాలంపంతులు.

రాత్రి భోజనం చేస్తూ భార్యతో అన్నాడు బాధగా—

"మెయిలు అనవసరంగా అరగంట ఆగిపోయింది ఇవాళ."

"పోనిలెద్దురూ, మనకెందుకూ?"

"అదిగో, ఆ "మనకెందుకూ" అన్న మాటే నాకు కిట్టదు. మనక్కాకపోతే మరెవరికి కావాలంటావ్?" బాధకి కోపం చెయ్యకలిపి మొగాన్ని కందగడ్డలాగా మార్చింది.

భార్య మరి మాట్లాడలేదు.

మజ్జిగ అన్నం తింటూ మళ్ళీ అన్నాడు:

"మెయిలూ, అరగంట ఆగిపోయిందే."

భర్తను సముదాయపరుద్దామనే అంది పాపం అమాయకంగా:

"పూర్వంలాగా కాదండీ ఇప్పుడు, రోజులు మారాయి"

దాంతో గోపాలంపంతులు బుర్రలో కందిరీగల దండు రెచ్చిపోయింది. తట్టుకోలేక పోతున్నాడు తమాయించుకోడానికి ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు పాపం! నోరు మెదపకుండ, అరిచేతిని వెండికంచం అంచుకు అదేపనిగా రాస్తూ శూన్యంగా చూస్తున్నాడు; అతని బాధ అర్థమయింది భార్యకి. తానూ బాధపడింది. మనసు మారుస్తేనేగాని లాభం లేదనుకుంది. అదృష్టవశాత్తూ సమయానికే గుర్తొచ్చింది—

## మరమనుషుల సేవ!

ఇంతవరకు వివిధ పారిశ్రామిక రంగాలలో సహాయకారులుగా వుంటున్న మరమనుషులు మానవకోటికి సేవచేసే రోజులు త్వరలోనే రానున్నాయి. ప్రొద్దునే, అలారం గడియారానికి బదులు, చెప్పిన వేళకి స్నేహపూర్వకంగా నిద్ర లేపే మరమనుషులను పశ్చిమ జర్మనీలో తయారుచేస్తున్నారు. స్నానానికి వేడినీళ్ళు కావాలనుకుంటే, షవర్ దగ్గరకెళ్ళి "షవర్ - 35డిగ్రీలు" అని అజ్ఞాపిస్తే, నిముషాలలో కోరిన వేడిగల వేడినీరు సిద్ధం చేయగల మరమనుషులు కూడా భవిష్యత్తులో రానున్నారు స్టెనోగ్రాఫరు అవసరం లేకుండా డిక్టేషను తీసుకుని, చెప్పిన దానిని టైపు చేసి యివ్వగల టైపు మిషన్లు కూడా తయారవుతున్నాయి.

"ఏమండీ! నాళంవారి సత్రంలో హరికథ వుందట, వెళ్దామండీ?" అడిగింది కోమలంగా.

"హరికథ వుందా? అయితే పద, వెళ్దాం" అన్నాడు, కంచంలో చెయ్యి కడుక్కుంటూ.

దంపతులు సత్రానికి చేరుకునేసరికి కథ మొదలయిపోయింది. మిగిలిన కథ సాంతం విన్నారు. మంగళం పాడగానే హారతి కళ్ళకు అద్దుకుని, పళ్ళెంలో చెరో అణా వేసారు.

దాసుగారుండే కొత్తగ్రహారానికి గోపాలంపంతులు వాళ్ళ వీధి గుండానే వెళ్ళాలి. దంపతులకి దాసుగారు పాత పరిచయస్థుడే అవడం వల్ల ముగ్గురూ కలిసి తిరిగి వస్తున్నారు. వెంకటేశ్వరస్వామివారి ఆలయందాటి పట్టుశాలివీధికీ పక్కగా గుండాలవారి వీధిలోకి మలుపు తిరిగారు— ఏవో మామ్మూలు కబుర్లే చెప్పుకుంటూ. కాని గోపాలంపంతులు బుర్రలో మెయిలుబండి లేటు విషయం ఇంకా కొట్టుకుంటూనే వుంది ఆ సంగతి దాసుగారితో చెప్పాడు విన్న వెంటనే దాసుగారి పాదాలు రోడ్డుమీద అతుక్కుపోయాయి. చిన్నగా నవ్వేడు గోపాలంపంతులు వేపు చూస్తూ. దాసుగారి నవ్వుకి గోపాలంపంతులకీ నవ్వు వచ్చింది. ఇద్దరూ నవ్వుకున్నారు ఒకరివేపు ఒకరు చూసుకుంటూ. అంతసేపటికి భర్త మొగం మీదికి తిరిగినవ్వు

వచ్చినందుకు గోపాలంపంతులు భార్య పైట అడ్డంగా పెట్టుకొని ఆనందంగా నవ్వుకుంది. కాని దాసుగారి నవ్వు అంతలోనే అదోలా మారిపోయింది అదేదో వెటకారపు నవ్వో వికారపు నవ్వో అనిపించింది. ఆ నవ్వును ఆపుకుంటూ అన్నాడు దాసుగారు :

"ఇది విను, గోపాలం, నీకే తెలుస్తుంది కొత్తనీటి ప్రభావం. ఆ మధ్య గోదావరి జిల్లాలో ఏం జరిగిందో విను ఎమ్మెల్యే అట, వివరిస్తాడని నన్ను వేళకి కథ మొదలెట్టనివ్వలేదు ఆ పెద్దమనిషి తీరుబాటుగా వచ్చేసరికి గంట లేటయింది. అంతసేపూ ముళ్ళమీదే కూచున్నాననుకో. కాని చెప్పకేం, అతగాడు వచ్చాక పట్టలేనంత ఆనందం పుట్టుకొచ్చింది. కూడా ఓ వంద మందిని వెంట తీసుకొచ్చాడు. ఆగడం మంచిదే అయిందని సంబరపడి పోయాను. మంగళహారతి శ్లోకం నా కళ్ళముందే గెంతులేసింది. ఆ రాత్రి ఎంత బాగా చెప్పాననుకున్నావ్ కథా! నారాయణదాసునే అయిపోయాననుకో తన్మయత్వంలో ఆ రాగాలేమిటి, ఆ సంగతులేమిటి, ఆ నృత్యం ఏమిటి! ఫస్టుక్లాసైన పిట్టకథలు అప్పటికప్పుడు పుట్టుకొచ్చాయయ్యా ఏ నవ్వేరు జనం! విరగబడి నవ్వేరంటే నమ్ము అతగాడూ నవ్వు ఆపుకోలేకపోయాడు- ఓ కన్ను ఆ ఎమ్మెల్యేగారి మీద నిగా పెట్టే వుంచా. కాని ఏం లాభం? మంగళహారతికి పది నిమిషాలు ముందుగా ఆ పెద్దమనిషి లేచి, ఉత్తుత్తి నమస్కారాలే పారేసి చక్కాపోయాడు. అతగాడి బృందంతో పాటు మరో యేభై మంది మన రెగ్యులర్సు కూడ పోలోమంటూ అతగాడి వెనకపడ్డారు. మంగళం పాడే వేళకి ఓ పాతికమంది అర్ధణా భక్తులు మాత్రం మిగిలారు. అంచేత యీ రోజుల్లో రైలు బళ్లు అరగంట లేటుగా వచ్చినా, గంట ఆగిపోయినా ఆశ్చర్యపడవలసిన అవసరం లేదంటా. నువ్వే చెప్పు గోపాలం. కథకి వచ్చిన పెద్దలు మంగళహారతి వరకూ ఆగి, ప్రసాదం తీసుకోకుండా ఎప్పుడైనా వెళ్ళారా? ఇంతకూ నే చెప్పేదేమిటంటే రోజులు మారిపోయాయని రోజులు మారాయి గోపాలంపంతులూ! రోజులు మారాయి."

తన అనుభవాన్ని కథలా రక్తిగా చెప్పినా అనుకోకుండానే గోపాలంపంతులు బుర్రలోని కందిరీగలపట్టుకి పొగ పెట్టాడు దాసుగారు. పీడకలకి పేరంటం బొట్టు పెట్టాడు. గోపాలం పంతులు మెదడు కందిరీగల కాట్లతో పచ్చి పుండు అయిపోయింది.

రాత్రంతా పలవరింతలే గోపాలంపంతులు— "మెయిలు అరగంట ఆగిపోయింది, రోజులు మారాయి" ఇవే పలవరింతలు. ఒకటే పలవరింతలు. తెల్లారేసరికి జ్వరంతో ఒళ్ళు కాలిపోతూ వుంది. డాక్టరుకు కబురు చేయించింది భార్య. తమ్ముడు మంచం పక్కనే పాతుకుపోయి అయోమయంగా చూస్తున్నాడు రామయ్య పంతులు. తోటికోడళ్ళిద్దరి కళ్ళూ చెమ్మగిల్లాయి. డాక్టరు పరీక్ష చేసి ఇంజక్షను ఇచ్చాడు. రోగిలో మార్పు వివరాలు పదిగంటలకి కబురు పంపమని చెప్పి వెళ్ళిపోయాడు డాక్టరు.

పదిగంటలకి రోగి పరిస్థితిలో పిసరంతైనా మార్పురాలేదు. డాక్టరు మళ్లీ వచ్చాడు. మరో ఇంజక్షను ఇచ్చాక "ఎలాగుంది గోపాలం పంతులూ ?" అంటూ నుదిటి మీద చెయ్యి వేశాడు. "మెయిలు అరగంట ఆగిపోయింది" అని జవాబు వచ్చింది. రామయ్య పంతుల్ని పక్కగా తీసుకెళ్ళి, వెంటనే బయల్దేరిరమ్మని గోపాలంపంతులు పిల్లలకి టెలిగ్రాములు పంపించమని చెప్పి జట్కాఎక్కి వెళ్ళిపోయాడు డాక్టరు.

సాయంత్రం అయిదుగంటలకి జ్వరంకాస్త తగ్గుముఖం పట్టింది. చిరు చెమటలు కూడ పోశాయి, చిన్న నిద్రా పట్టింది గోపాలం పంతులుకి. కళ్ళు తెరిచేసరికి ఆరుగంటలయింది. ఎదురుగా డాక్టరు నిలబడి ఉన్నాడు.

"మరి ఫరవాలేదు గోపాలంపంతులూ, గండం దాటేశావు" అన్నాడు డాక్టరు.

"మెయిలుకి లైను క్లియరు అయిందా ?" అడిగాడు గోపాలంపంతులు.

"అయింది" అన్నట్లుగా తల ఊపాడు డాక్టరు.

'నిన్న జరిగిన పొరపాటు చూస్తే మళ్ళీ జరగనిస్తానా!" అంటూ ఉద్రేకంగా లేచి,

"ఏమే, నా గొడుగు అందుకో" ఆదేశించాడు భార్యని.

"ఫరవాలేదు గోపాలం పంతులూ, ఆ విషయం నేను చూసుకుంటానుగా. నువ్వింకా కాస్సేపు రెస్టు తీసుకోవాలి మరి" అన్నాడు డాక్టరు

"వీల్లేదు. నేనే వెళ్ళి తీరాలి. పని మీద పరమ నిర్లక్ష్యం యీ కొత్తవాళ్ళకి" అంటూ తిరిగి లేవబోయాడు. బలవంతం మీద మళ్ళీ పడుకోబెట్టి,

"మీరు రెస్టు తీసుకోవాలి గోపాలం పంతులూ. మెయిలు బండి విషయం నేను స్వయంగా చూస్తానన్నాగా! ఇదిగో, ఇప్పుడే వెళ్తున్నాను స్టేషనుకి" అని చెప్పి "ఎలాగైనా సరే యీ బిళ్ళలు రెండూ అతనిచేత మింగించండి, కాస్త నిద్దర పట్టొచ్చు" అని రెండు మాత్రలు రామయ్య పంతులికి ఇచ్చి గడప దాటాడు డాక్టరు.

ఆ బిళ్ళల ఫలితంగా ఓ అరగంటసేపు మెదలకుండ పడుకున్నాడు గోపాలంపంతులు. తెలివి వస్తూనే లంకించుకున్నాడు :

"అదిగో, సిగ్నలు వాలిపోయింది. డ్రైవరూ, గార్డూ వంగి వంగి ఒకరివేపు ఒకరూ చూసుకుంటున్నారు, ఇంకా గంట






# బిళ్లలేని నల్లటోపీ

కొట్టాడేం జెమెదారు వెధవ? ఏమే, ఆ జెండా అందుకో నా విసిల ఏది?''

అంటూ గభిమని లేచి, చిలక్కొయ్యకి తగిలించివున్న ఆ బిళ్ళలేని చిన్న మేష్టు నల్లటోపీ నెత్తిన పెట్టుకొని, సరాసరి వంటింట్లోకి దౌడ తీసాడు గోడఅలమారాలో ఉన్న ఇత్తడి పళ్లాన్ని తీసి, గరిటతో ''ఠంగ్, ఠంగ్; ఠంగ్, ఠంగ్; ఠంగ్ ఠంగ్'' అని రెండేసి గంటలు మూడుసారు కొటి,

''గంట కొట్టాసాను ఇంద్రుడొచ్చినా ఇక మెయిలు ఆగడానికి వీల్లేదు'' అనేసి మంచంమీద వాలిపోయాడు. ఇంకా దిండుకి తల తాకిందో లేదో,

''అరె, మర్చిపోయాను'' అంటూ నిటారుగా నిలబడి, టోపీ సద్దుకొని, ఎడంచేతి బొటనవేలూ, చూపుడు వేలూ పెదాలకి చేర్చి, బూరెల్లాగా పొంగించిన బుగ్గల్లోని గాలిని 'ఊఫ్'' మంటూ వూది కుడిచెయ్యి గాల్లో ఆడించాడు

''విసిలు ఊదేసాను. జండా కూడ చూపించేసాను హరిహరాదులు అడ్డుపడినా బండి మరి ఆగదు.''

అని ధీమాగా అనేసి మంచం మీద పరుచుకు పోయాడు, నల్లటోపీని పొట్టమీద నెమ్మదిగా బోర్లిస్తూ. బండి బయలుదేరి పోయిందన్న ఆనందంతో చిన్నగా నవ్వుతూ భార్యవేపే చూపును నిలిపాడు గోపాలం పంతులు.

తెల్లారేసరికి ఇంటినిండా జనం. ఇంటి బయట జనానికి లెక్కలేదు. మెయిలు బండి వెళ్లిపోయిన తర్వాత తిరుగు ముఖం పట్టిన జనంలాగే – నవ్వుకుంటున్నవాళ్ళూ, గంభీరంగా ఉన్నవాళ్ళూ, కంటతడి పెట్టిన వాళ్ళూ, వాళ్ళ నిమాసి నవ్వుకుంటున్నవాళ్ళూ, కేవలం గోళ్లు గిల్లుకుంటున్నవాళ్ళూ– ఈ విధంగా ఉన్నారు జనం.

ఈ దృశ్యాన్ని చూస్తూ విస్తుపోయిన పోస్టుమన్ సన్యాసయ్యకి కడుపు దేవుకు పోయింది ఆపుకోలేక బయటికే అనేసాడు–

''హరి బగవంతుడా! ఏంవిటిదంతా? రోజుకు రోజూ ఇలా మారిపోతున్నారేంటి మనుషులంతా? విచారానిక్కూడ వింత వింత మొగాలే మొలవాలా!''

(అయిపోయింది)




## 8-1-1982 శుక్రవారం మొదలు 14-1-1982 గురువారం వరకు

మేషం:—నూతనసంవత్సరంలో. గ్రహానుకూలత గలదుగాన. అన్నివిధాలా మేలు చేకూరుట వాస్తవం. పండుగ పబ్బాలకని అధికంగా వ్యయంచేయటం, నగలోవస్త్రాలో కొనే అవకాశమున్నది. నూతన వ్యాపారమేదో ప్రారంభం కానున్నది. స్త్రీలకు: సుఖశాంతులు, ఆనందం. అధికారం పెరగటం చెప్పదగిన అంశాలు.

వృషభం:—అన్ని విధాలా మేలైన వారం. అధికాదాయం ఆశించవచ్చు. అధికారుల ఆదరణ లభించే అవకాశమున్నది. బంధుప్రీతి. మిత్రుల ఆదరణ లభించగల వారం. ఉద్యోగంలో 'ప్రమోషన్' కొందరు ఎదురుచూడవచ్చు. క్రీడారంగంలో, రంగస్థలంలో, చిత్రరంగంలో కొందరకు అవకాశాలుంటాయి. స్త్రీలకు: వస్తు వస్త్ర సేకరణకు ఆనందానికి అవకాశం గలవారం.

మిథునం:—మీ పనులు క్రమంగా నెరవేరటం ఆలోచనలు ఫలించటం, ధాన్యం ఇల్లు చేరటం. బంధువుల రాకపోకలు. వివిధ రంగాలలో అధికారం పెరుగుటకు అవకాశమున్నది. అనుకున్న ప్రకారంగా శుభ కార్యాచరణం సంభవం. స్త్రీలకు: సుఖం ఆనందం అపురూప వస్తు సేకరణకు అవకాశం గల వారం.

కర్కాటకం:—కళా సాహిత్య రంగాలలో నూతనావకాశాలు లభించనున్నవి. అప్రయత్నంగా ధనం లభించే మార్గమున్నది. స్వకార్యాచరణలో కొంత జాప్యం జరుగవచ్చు. నూతన మార్గాలలో మీకు ధనాదాయానికి అవకాశాలుండగలవు. స్త్రీలకు: బంధుప్రీతి, అధిక గౌరవం, రచనా విధానంలో మేలు చేకూరగల దినాలు.

సింహం:—గ్రహించండి. నూతన విషయాలు తెలిసికోవటం, నూతన ప్రయత్నాలకు దిగటం నలుగురలో మంచిపేరు తెచ్చుకొనే అవకాశం ఏర్పడనున్నది. కొందరకు పత్రికా ప్రకటన యుండు. సభా కార్యక్రమాలలో పాల్గొనుటకు అవకాశం ఏర్పడనున్నది. స్త్రీలకు:. ముఖరంగాలలో అభివృద్ధి. విద్యాయోగ్యతకు అవకాశాలు ఏర్పడనున్నవి.

కన్య:—ఉద్యోగంలో మార్పు రావటానికి సహజంగా అవకాశాలుండగలవు. చాలామందికి స్థల మార్పో, గృహమార్పో చెప్పదగిన సమయం అందుకుతోడు వస్తువులు పోగొట్టుకొనే అవకాశమున్నది. క్రీడారంగంలో అవకాశాలు, అధిక వ్యయం అయ్యే మార్గమున్నది. స్త్రీలకు:— విద్యాయోగ్యత, ఉద్యోగంలో కొన్ని మార్పులు రావటం, క్రీడారంగంలో అనుకూలత చెప్పదగిన వారం.

తుల:—నూతన మార్గాలలో మీకు అవకాశాలు, ఆదరణ, అధికారులవలన జరుగవలసిన



# వనితలకి మంచి అవకాశం !

## జంట నగరాలలో

# వనితల సమస్యలు

హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాలలో వనితాలోకం ఎన్నోరకాల సమస్యలు ఎదుర్కొంటోంది.

వీటిని నలుగురి దృష్టికి తీసుకువస్తే అవి పరిష్కారం అయ్యే అవకాశాలు అధికం అవుతాయి.

ఇప్పటికే ఆంధ్రపత్రికలో వనితావాణి, విద్యారంగం — నేటి సమస్య, మావూరి సమస్య వంటి శీర్షికల ద్వారా ఎన్నో రకాల సమస్యలకి చర్చావేదికలు ఏర్పాటు చేశాము.

దాదాపు ఇరవై లక్షల జనాభా గల జంట నగరాలలో నివసించే వనితలకోసం ఒక ప్రత్యేకమైన శీర్షిక ప్రారంభిస్తే బాగా ఉంటుందని **జంట నగరాలలో వనితాలోకం సమస్యలు** అన్న శీర్షికని మొదలు పెడుతున్నాము.

ఈ కొత్త శీర్షిక హైదరాబాదు, సికిందరాబాద్‌లలో నివసించే వనితలకి మాత్రం పరిమితం అయి ఉంటుంది.

జంట నగరాలలో వనితలు ఎన్నో సమస్యలు ఎదుర్కొంటున్నారు.

ఏ సమస్యని గురించి అయినా సరే వనితలు తమకు తోచినది రాసిపంపాలని మా కోరిక.

రచనలు 500 నుంచి 1000 అక్షరాల దాకా ఉంటే బాగా ఉంటుంది. ఇంతకి మించిన వాటిని వెయ్యటం కష్టం !

రాజధానిలోని వనితా లోకం ఈ కొత్త శీర్షికలో ఉత్సాహంతో పాలుగొని దానిని విజయవంతం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

ప్రచురించిన ప్రతి రచనకి రు. 15 లు పారితోషికం పంపుతాము.

రచయిత్రులు తమ రచనలతో తమ ఫోటోలు కూడా పంపితే రచనలతోబాటు వాటిని వెయ్యగలము, ఫోటో వెనుక రచయిత్రి సంతకం ఉండాలి.

**నిబంధనలు :**

- ★ రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే, కాగితానికి ఒకవయిపు మాత్రమే సిరాతో రాసి ఉండాలి.
- ★ రచనలు సంపాదకుడు, ఆంధ్రపత్రిక, బషీర్‌బాగ్, హైదరాబాద్ – 29 కి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు.
- ★ రచనలతో బాటు తమ స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజీ కలిగిన కవరులు జతపరచిన వారికి ప్రచురణకి స్వీకరింపబడని రచనలూ, ఫోటోలు తిప్పి పంపగలము.
- ★ తుది నిర్ణయం సంపాదకునిదే ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపటానికి వీలు ఉండదు.
- ★ రచనలు పంపే కవరు మీద స్పష్టంగా "జంట నగరాలలో వనితాలోక సమస్యలు" అని రాసి ఉండాలి.
- ★ ప్రతి రచనలోను ఈ క్రింది కూపను జతపరచాలి కూపను జతపరచని రచనలు ప్రచురణకి పరిశీలించటం జరగదు. వ్రాత ప్రతిమీద సయితం రచయిత్రి పేరు, పూర్తి చిరునామా రాసి ఉండాలి.

పేరు : ..........................................................

పూర్తి చిరునామా : ..........................................................

..........................................................

..........................................................

..........................................................

రా. వ. స.

## వారఫలం

పనులు సక్రమంగా జరగటం గమనించ గలుగు తారు. సుఖశాంతులకు, క్రయ విక్రయాలలో లాభం ఉద్యోగంలో ప్రగతికి, కొందరకు నూతనోద్యోగ ప్రాప్తికి అవకాశమున్నది. స్త్రీలకు : అన్నిరంగాలలో మేలున్నది. క్రీడావనిలో, సభా కార్యక్రమంలో పేరు పెరిగే మార్గమున్నది.

వృశ్చికం: — వ్యాపారంలో కొంత మందకొడితనం ఏర్పడుతుంది. ఏదైనా సొంతంగా చేసికొన్నంత హాయి మరొక విధంగాలేదు. ఉద్యోగవృత్తులందు సుకరంగా జరిగే మార్గం ఉంటుంది. శుభకార్యం జరిగే అవకాశము గల వారం. స్త్రీలకు : నూతన విషయాలు తెలిసికోవటం, నూతన మార్గాలలో ఆదాయం సానుకూలం కావటం, విశేషంగా గ్రహించాలి.

ధనుస్సు: — దూర ప్రాంతాల నుండి బంధువులో, మిత్రులో యింటికి రాగలిగే అవకాశమున్నది. సుఖశాంతులకు అవకాశం గల వారం. నూతన వత్సరం ఏదో వ్యాపార కార్యక్రమంలో నిమగ్నులు కాబోవుచున్నారని గ్రహించుటకు ఎంతో కాలం పట్టదు. స్త్రీలకు : ఆరోగ్యంబాగుండటం, ఆనందం, కుటుంబ సభ్యులవలన సంతోషం ఏర్పడే అవకాశముంటుంది.

మకరం: — ఆలోచనలు అలాగే ఉండక ఒక మార్గానికి రాగల అవకాశాలుంటాయి. ఉద్యోగ వృత్తులందుమీకు అనుకూలత ఏర్పడగలదు. విలువగల వస్తువుల కొనుగోలు చేయగలరు. భూమికొనే ప్రయత్నమో, గృహ విస్తరణకార్యక్రమమో కొందరు చేపట్టనున్నారు. స్త్రీలకు: వస్త్ర వాహనాలు ఏర్పాటు కావడానికి, విదేశపర్యటనానుకూలత క్రీడారంగంలో విశేషాదరణ లభించుటకు మేలైన వారం

కుంభం: — నీతి నియమాలతో సత్యసంధతతో కార్యక్రమం నెరవేర్చుకొన గలిగిన మీకు సర్వానుకూలత అన్ని రంగాలలో ఏర్పడనున్నది చిత్రరంగంలో నిర్మాతలు నూతన 'ఫిల్ములు' ప్రారంభించే అవకాశం కూడా ఏర్పడ నున్నది. కొందరకు నూతనోత్సాహం కలిగి — అన్నిరంగాలలో సర్వానుకూలత ఏర్పడగలదు. స్త్రీలకు : వయస్సు వచ్చిన వారికి వివాహ ప్రయత్నాలుండటం, రచనా విధానంలో అనుకూలతకు ఆస్కారం గలదు.

మీనం: — ఈ సంవత్సరం, ఈవారం, సామాన్యమేనా ? అని అనుకోరాదు. వృత్తి వికసించే మార్గం, మాటల చాకచక్యం వలన ఆదాయం, భూమిని కొనుగోలు చేయు ప్రయత్నాలో, క్రయ విక్రయాలలో లాభార్జనా ప్రయత్నాలో గావింప నున్నారు. స్త్రీలకు : నగలో, వస్త్రాలో కొనుగోలు చేయుటం. పదిమందిలో ప్రతిష్టకు ఆస్కారంగలవారం, ఆరోగ్య లోపంరాదని గ్రహించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



అతనాడిన పది టెస్ట్ మ్యాచ్‌ల్లోను "జీరో" కొట్టి ప్రపంచ రికార్డు స్థాపించాడు తెరా!!



ఎక్కడికి బ్రదర్ ప్రయాణం?.. ఊరు పనికా??
కాదోయ్ క్రికెట్ టెస్ట్ మ్యాచ్ చూడ్డానికి!!



నిన్న క్రికెట్ ఆడడానికి వెళ్ళావట!! నిజమేనటా??



టైమెంతయ్యిందండీ?! స్కోరెంతయ్యిందండీ!?
విజయ్
క్రికెట్


నువ్ ముందా పాట- లాపుతావా? నే క్రికెట్ కామెంట్రీ వినాలి!!
నువ్ ముందా కామెంట్రీ ఆపెయ్ నే పాట వినాలి!!



సెంచరీ చేస్తేనె గాని గడ్డం తీయించనని శపథం చేసాడ్!!



(గత సంచిక తరువాయి)

గొంతుక్కూర్చుని అటుతిరిగి పెట్టెలో బట్టలు సర్దుకుంటున్నాది తార. ఆమె పొడవాటి జడ వీపుమీంచి, సన్నని నడుముమీంచీ క్రింద నేలమీదకు జారిపడి ఉంది

ఆకుపచ్చరంగు బిన్నీ సిల్కుచీర, తెలుపు నాయిల్ జాకెట్ వేసుకుంది వెనుకనుంచీ ఏ ఆచ్ఛాదనా లేకుండా కన్పిస్తున్న పచ్చని కాస్త వీపు భాగమూ, చేతులూ, మెడా ఆ దుస్తుల్లో పచ్చని ఆకులమధ్య అరవిరిసిన తెల్లగులాబీల్లా మెరుస్తూ కన్పిస్తున్నాయి !

గుమ్మానికి రెండుచేతులూ వేసి అభిమానంగ చూసాడు వెంకటరత్నం. అతని చూపుల్లో నుండి అంతులేని అనురాగ స్రవంతి ప్రవహిస్తున్నాది

''తారా !''

ఉలిక్కిపడింది తార. చటుక్కున వెనక్కు తిరిగిచూసి, అంతలోనే సిగ్గుపడిపోయింది. మెల్లిగాలేచి నిలబడింది ఆమె చూపులు నేలమీద చిక్కుపడిపోయాయి

''మీ ఊరెళ్ళటానికి బట్టలు సర్దుకుంటున్నావా ?''

''ఊఁ—'' విన్పించీ విన్పించనంత మెల్లిగా, అస్పష్టంగా అన్నది.

గుమ్మంలోనుంచీ లోపలకువచ్చి, అద్దం ముందుకెళ్ళి తల దువ్వుకుంటున్నాడు.

బయటకు వెళ్ళిపోవటమా, ఉండటమా సందిగ్ధంగా నిలబడింది తార.

బీరువా తెరచి షర్టు, లుంగీ తీసుకుంటూ ప్రక్కన స్టూలుపైన మధ్యకు తెరచి బోర్లించి పెట్టిన పుస్తకం చూసాడు వెంకట్

బట్టలు వేసుకున్నాక, పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు ''నీకు పుస్తకాలంటే ఇష్టమా తారా ?''

ఒళ్ళు పులకించుతున్నాది తారకు 'ఆ పేటలో ఎంతోమంది తనను పిలిచారు. కానీ, వెంకట్ పిలుస్తోంటే — అతని మృదు గంభీర స్వరంలోంచి తన పేరు వెలువడుతూంటే — అబ్బ! ఎంత బాగుంది ! తన పేరులో ఇంత అందమున్నాదా !'

తల ఊపింది మెల్లగా.

నవ్వాడు వెంకట్

''ఈ ఊరు బాగుందా ?''

'బాగుంది' అన్నట్లు తల ఊపింది

'అమ్మా, నాన్నా, చెల్లెళ్ళూ — అందర్నీ చూసావుకదా ! నీవు వాళ్ళతో కలిసిపోగలవా ?'

నిదానంగా తలెత్తి అతని ముఖంలోకి చూసింది అంతలోనే తలవంచి 'కలసిపోగలను' అన్నట్లుగా తల ఊపింది.

మళ్ళీ నవ్వాడు వెంకట్.

''నన్ను చూస్తోంటే భయంగా ఉన్నదా ?''

'అదేమిటి ! అలా అడుగుతారెందుకు ?' అన్నట్లు ఆశ్చర్యంగా చూస్తూ, 'లేదు' అన్నట్లుగా తల ఊపింది

చిరునవ్వుతో ఆమె ముఖంలోకి ప్రేమగా, కొంటెగా చూస్తూ మళ్ళీ అడిగాడు -

''అయితే, మూగదానివా ?''

దిమ్మెరపోయి, చటుక్కున తలెత్తి అతని ముఖంలోకి చూసింది.

అతని కళ్ళు నవ్వుతున్నాయి, కవ్వింపుగా.

''అన్నింటికీ బొమ్మలాగా అలా తల ఊపుతూంటే — ఈ అందాల బొమ్మకు నిజంగానే మాటలు రావో ఏమో అని అనుమానంగా ఉంది సుమా !''

తార పల్లెటూరులో పుట్టింది. అక్కడే పెరిగింది ఆ యింట్లో ఆమే పెద్దపిల్ల రాఘవయ్యగారు అదొక రకమైన గంభీర వ్యక్తి పిల్లల ఎదురుగా ఆయన భార్యతో ఎపుడూ చనువుగా ప్రవర్తించేవారు కాదు కనీసం సరదాగా కూడా మాట్లాడేవారుకాదు. ఎపుడయినా నాగరత్నమ్మ సాధింపుగా అన్నాకూడ నవ్వేసి ఊరుకొనేవారేకానీ బదులు చెప్పేవారు కాదు

తారకు అటూ ఇటూ ఇళ్ళకు వెళ్ళే అలవాటు లేదు. అందుకే ఇప్పుడు వెంకట్ మాటలు వింటూంటే ఆశ్చర్యంగా ఉన్నాది! ఏదో పుస్తకంలో చదువుతూన్నట్లుగా ఉన్నాది ! మామూలుగా కూడా మనుషులు ఇలాగ మాట్లాడుకుంటారా అన్నంత ఆశ్చర్యంగ చూస్తున్నాది.

మాటలు క్రొత్తగా ఉన్నా, అవి మనసుకేదో ఉల్లాసాన్నిస్తున్నాయని మాత్రం అర్థమవుతున్నాది కాని, ఆతనంత ... ఛ ! ఛ ! ఆయనంత బాగా మాట్లాడటం తనకురాదే !

ప్రకృతిలో సహజమైన అందాలు ఎన్నో పొదగబడి ఉన్నట్లే ప్రతిమనిషిలోనూ వయసు రేకెత్తించే భావాలూ, కోర్కెలూ, వాళ్ళకే తెలీని సహజత్వాలు చాలా దాక్కొని ఉంటాయనిపిస్తుంది

తార పెదవులమీద ఒక సజీవమైన చిరునవ్వు మెరపుతీగిలాగా తళుక్కుమని మెరిసింది ఆమె ముఖమంతా అరుణరాగ రంజితమై దివ్యకాంతితో ప్రకాశిస్తున్నాది

సన్నగా, పొడవుగా, కదిలే కొండపల్లి బొమ్మలాగా, ప్రాణంపోసుకున్న అజంతా సుందరి లాగా - అన్నింటినీ మించి తనను కదిలించిన రాగ తరంగిణి, కోరి తెచ్చుకున్న ఈ అందాల భార్య, అపురూపవ్యక్తి - చటుక్కున ముందుకువచ్చి రెండు చేతుల మధ్యా బిగించి గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు

- కెవ్వు మనబోయి, తమాయించుకుని భయంతో, సిగ్గుతో, తెలీని, అర్థంకాని అనేక భావాలతో ముడుచుకుని మూలకు ఒదిగిపోయి నించుంది తార

ఆమె శరీరం అదొక రకమైన ఉద్వేగ భావంతో కంపించుతున్నాది !

**జరిగిన కథ — 4** రాఘవయ్య, నాగరత్నం దంపతులకు తార, సరళ—రామారావ్, రామ్మోహన్, చంద్రం సంతానం అందరిలోకీ పెద్దది, అందం, వినయవిధేయతలు కల 'తార' అంటే రాఘవయ్య గారికి ప్రాణం సరళ బదక్కస్తురాలు, పైగా గడుసు స్వభావం కలది రామారావ్ అదో తరహా మనిషి ! మోహన్, చంద్రాలకు ఇంకా బాల్యావస్థ వీడలేదు. చిన్నప్పట్నుంచీ పెంచి పెద్దచేసి, చదువు చెప్పిస్తున్న తమ్ముడు ప్రసాద్‌కు తార నిచ్చి పెళ్లి చేయాలని నిశ్చయించుకొంటుంది నాగరత్నం. రాఘవయ్య కూడా కాదనలేదు. కానీ ప్రసాద్ పరుశురామయ్య పెద్దకూతురును చేసుకొంటానని చెప్పగా ఏడ్చి అతన్ని బయటకు గెంటేస్తుంది. ఆ ఇంటి ఆప్తుడు మునసబు మామయ్య తారకు ఓ సంబంధం చూస్తుంటాడు. ఆ సంబంధం తాలూకూ కుర్రాడు వెంకట్రావ్ తార వయసును ఆకర్షించలేకపోతాడు తండ్రి అనుమతితో తార ప్రసాద్ పెళ్ళికి వెళ్తుంది. పరశురామయ్య తమ్ముడు శ్రీనివాసరావ్ అప్పటికే బాగా ప్రచారంలో వున్న కమ్యూనిస్టు పార్టీలో తిరుగుతుంటాడు. అతనికి గురువులాంటివాడు వెంకటరత్నం. యువకుడైనా ఆ పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు. శ్రీనివాసరావ్‌తో కలసి ప్రసాద్ పెళ్ళికి వెళ్ళిన వెంకటరత్నం మదిలో 'అనుకోని సంఘటన' ద్వారా ముద్రవేసుకొంటుంది తార. బాబాయి బలరామయ్య తీసుకొచ్చిన సంబంధం, పెళ్లిలో చూసిన 'అతనే'నని తెలుసుకొన్న తార ఎలాగయినా నాన్నతో చెప్పి వప్పించాలని నిర్ణయించుకొంటుంది. ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకొంటుంది తార.

ఆ తొలిముద్దు – వెంకట్ శరీరంలోకి ప్రేమ రసాన్ని జరజరా ఎక్కించి అంతులేని ఉల్లాసాన్ని అందించుతోంది. ఆ క్షణంలో ఆమె పైన ఉండే ప్రేమ కొండంత ప్రమాణంలో పెరిగిపోయింది.

ఇంకోసారి ఆమె ముఖంపైకి వంగబోతూన్న వెంకట్ ముఖాన్ని రెండు చేతులతోనూ పట్టి ఆపి, "ఉహూం—" అంది తార.

"ఉహూం— !?" కొంటెగా నవ్వుతూ, ఆమె చేతులను తన చేతులతో పట్టి మృదువుగా నొక్కుతూ "ఇలాంటి విషయాల్లో మాత్రం నీ ఇష్టంతో పనిలేదోయ్." మరోసారి సున్నితంగా ముద్దు పెట్టుకున్నాడు.

అతని చేతుల్లోంచి విడిపించుకుని చటుక్కున బయటకు రాబోయింది. కాని, ఆమె పొడవాటి జడను అంది పుచ్చుకున్నాడు వెంకట్.



గబుక్కున వెనక్కు తిరిగి జడపైన చేయివేసి 'వదలరూ' అన్నట్టుగా చూసింది.

సరదాగా నవ్వేసాడు వెంకట్. ఆమెని వదిలేస్తూ అన్నాడు – "నాకు అన్నం పెడతావా ?"

పాలరాతి శిల్పానికి ప్రాణం వచ్చి కదిలినట్టుగా నడిచి వెళ్ళింది తార. వంటగదిలో అన్నీ సర్దే ఉన్నాయి. కంచం మళ్ళీ కడిగి పెట్టింది. గ్లాసు కడిగి, నీళ్ళు పట్టి పెట్టింది.

వెంకట్ ఒకసారి వీధిలోకి వెళ్ళాడు. బుచ్చమ్మ నాటకంలో లీనమై ఉన్నాది.

"ఏరా ! స్నానమైందా? భోజనం పెట్టనా?"

"నేను తింటానులే అమ్మమ్మా. నువ్వు చూడు."

"పోనీ, అమ్మాయిని వడ్డించమనరా, సిగ్గు పడకు. పెళ్ళామేగా ! తప్పేముంది ! ఇవ్వాళ కాక పోయినా రేపట్నుంచి ఆదేగా నీకు పెట్టేది !"

"అలాగేలే అమ్మమ్మా !" నవ్వుతూ లోనికి వచ్చేసాడు.

తార అన్నం సర్ది, కూర వేస్తున్నాది. వెంకట్‌వచ్చి పీటమీద కూర్చున్నాడు

తార కాస్త దూరంగా నించుంది

అన్నం కలుపుకుని, నేయి వేసుకుంటూ తల ఎత్తి తారవంక చూసాడు

"ఇలాకాదు తారా ! భర్తకు అన్నం పెట్టే పద్ధతి ఇదికాదు ! ఇలారా !" అన్నాడు

కదల్లేదు తార.

"ఇలా దగ్గరకు రా !" మళ్ళీ పిలిచాడు.

"ఊహూం — మీరు భోంచేయండి" చాలా మెల్లిగా అన్నది.

"నేను భోజనమే చేస్తున్నానుగానీ, ఇక్కడకు రా !" మళ్ళీ అన్నాడు.

కదల్లేదు తార. తనలో తాను మూతిముడిచి నవ్వుకుంటూ, చేతులకున్న గోరింటాకు రంగు చూసుకుంటూ అలాగే నిలబడింది.

సన్నగా నవ్వాడు వెంకట్.

"ఏదైనా నాకు ఒక్కసారి చెప్పటమే అలవాటు రెండోసారి చెప్పించుకునే వాళ్ళంటే నాకు మహా చిరాకు."

అదిరిపడి తలెత్తింది తార. నవ్వుతూనే

ఉన్నాడు వెంకట్. కాని, ఆ మాటల్లో ఉన్న ఏదో పదును ఆమెని తీసుకొచ్చి దగ్గరగా నిలబెట్టింది.

"కూర్చో" ఎడమచేతితో ఆమె చేతిని పట్టి లాగి కూర్చోబెట్టాడు.

"నాకు భయంగా ఉన్నాది."

తనంత తానుగా మాట్లాడిన మొదటిమాట!

ఆశ్చర్యపోయాడు, వెంకట్

"ఎందుకు ?"

మాట్లాడలేదు తార

చిన్నగా, అనునయంగా అన్నాడు —

"తారా! ఎంత అమాయకురాలివి నువ్వు! చూడు! ఇందులో తప్పేమి ఉంది ? మనం భార్యాభర్తలం! నువ్వు నాకు అన్నం పెట్టటంలో ఏం తప్పులేదే! మనం తప్పు చేయనపుడు ఎవ్వరికీ భయపడకూడదు! తెల్సిందా."

'సరే!' అన్నట్లు తల ఊపింది

"వెరీగుడ్" నవ్వుతూ, తార తలపై చిన్నగా మొట్టాడు వెంకట్.

తారకూడా నవ్వింది

అప్పటివరకూ ఉన్న బిడియమేదో మాయమై పోయింది. ఇంట్లో అందరకూ కొసరి కొసరి వడ్డించినట్లే వెంకట్‌కు కూడా చనువుగా, ప్రేమగా, భక్తిగా వడ్డించింది

"ఇంక అన్నం వద్దు తారా ఉత్తి పెరుగు వేయి చాల" అన్నాడు వెంకట్

"ఉహూఁ—పెరుగన్నంతినకపోతే వేడిచేస్తుంది కొద్దిగా అన్నం పెట్టించుకుని పెరుగు వేయించు కోండి."

"కడుపులో ఖాళీలేదు తారా."

"అదే ఉంటుంది. ఇదిగో—ఈమూల ఖాళీగానే ఉన్నది" పొట్టవైపు వేలుపెట్టి చూపుతూ అన్నది

నవ్వాడు వెంకట్.

కొద్దిగా అన్నంపెట్టి పెరుగువేసింది ఉప్పు వేసి, కొద్దిగా నీళ్ళు పోసింది.

"అరే! ఈ నీళ్ళెందుకు ?"

"గడ్డ పెరుగుతో తినకూడదుట. కొంచె మయినా నీళ్ళు కలుపుకోవాలిట. లేకపోతే . ."

ఆపేసింది తార.

"ఊఁ — లేకపోతే — ?" ఏమవుతుందో చెప్ప మన్నట్లుగా రెట్టించాడు వెంకట్.

అరటిపండు తోలుతీసి, పండుని ప్లేట్లో వేస్తూ అన్నది - "ఏమవుతుందో మర్చిపోయాను గానీ, మీరు అన్నం తినేసెయ్యండి."

"అబద్ధం! నువ్వు మర్చిపోలేదు చెబితేకానీ నేను తినను" అలిగినట్లుగా అన్నాడు

నవ్వింది తార. "మీరు చాలా గడుసువారు అనుకున్నది సాధించిగాని వదలరనుకుంటాను మీతో చాలా కష్టమే బాబూ!" ఎడమ మోకాలిపైన ఎడమచేతి వ్రేళ్ళనుంచి, దానిపైన గడ్డం ఆనించి కొద్దిగ కళ్ళెత్తి చిరునవ్వుతో, కొంటెగా అతని కళ్ళల్లోకి చూస్తూ అంటూన్న తారకూ, పది నిమిషాలముందు బిడియంగా, భయంగా మూలక ముడుచుకుపోయి నించున్న తారకూ పోలికే లేదు

ఇప్పటి తార అత్యద్భుతమైన, సజీవమయిన తనకు నచ్చిన మూర్తి! అంత అందం ఎదురుగా కవ్విస్తున్నట్లుగా ఉంటే — చురుగ్గా నవ్వాడు వెంకట్.

"అబ్బో! చిలకకు మాటలొచ్చేసాయన్న మాట! ఉహూఁ — ఈకాస్త పరిచయంలోనే నా సహచర్యంలో ఉండే కష్టమేమిటో గ్రహించే సావుకదూ! ఉండు — నీపని చెబుతాను" అన్నం కలుపుతూ అంటూన్న అతని మాటలకు కిలకిలా నవ్వింది తార.

ఆనవ్వు — క్షణంసేపు వెంకట్‌ని గిరుస అన్ని లోకాలకూ తిప్పి తీసుకొచ్చింది ముగ్ధుడై చూసాడు ఆమె వైపు.

ఇహ అతనికి ఆ తిండి తినాలన్పించలేదు. "ఇంక తినలేను తారా." చేయి కడుక్కుందుకు గ్లాసు తీయబోయాడు

చటుక్కున ఆ చేతిమీద తన చేయివేసి గ్లాసుని విడిపిస్తూ అన్నది —

"ఉహూఁ— ఈ కొంచెం తినేసెయ్యండి"

"ఉహూఁ— ఇంక తినలేను"

"ఉహూఁ — తినాల్సిందే!"

"తినకపోతే — ?" కొంటెగా ఎదురు ప్రశ్న వేసాడు వెంకట్.

"తినిపిస్తాను." రక్కున అనేసి, అంతలోనే సిగ్గుపడిపోయి వాలుక్కరుచుకుంది.

హోయి!" నవ్వాడు వెంకట్ భార్య భుజంపైన ప్రేమగా తట్టాడు.

వక్కపొడి వేసుకుంటూ అప్పుడే గుర్తొచ్చినట్లుగా అడిగాడు, "అవునూ, నాటకానికి నువ్వెందుకెళ్ళలేదూ ?"

వక్కపొడి డబ్బాని అల్మారాలో ఉంచి వస్తూ అన్నది — "మీకు ఇష్టం ఉండదుట కదా!"

"ఎవరు చెప్పారు ?"

"కళ్యాణి చెప్పింది కేవలం అందువల్లనే కాదు; నాకూ అంతగా ఇష్టం ఉండదు."

నాటకంలో సీను మారుస్తున్నారు కాబోలు, మైకులో పెద్దగా పాటలు వేస్తున్నారు.

వేసవికాలం మూలంగా వెంకటరత్నం ముందర వైపున ఆరుబయట మంచం వేసుకుని పడు కుంటాడు.

ఆడవాళ్ళకు వెనుక వరండా దిగువన మంచాల వేసి పక్కలు పరచి ఉన్నాయి. వెంకట్‌లో మరో అలవాటు ఉన్నాది. అతను తన మంచంపై తప్ప ఇంకొకరి పక్కపై పడుకోడు కనీసం కూర్చోవ టానికి కూడా ఇష్టపడడు! అలాగే తన మంచంపై ఎవరయినా కూర్చున్నా సహించడు

ముందరవైపున పరచిన తన మంచంవైపుకు వెళ్తూ అన్నాడు తారతో—"ఆ తలుపులువేసి నువ్వు కూడా ఇటువైపుకు రా! నీకు చాలా విషయాలు చెప్పాలి."

వెంకటరత్నం బయటకు వచ్చి అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు.

సీను మార్చటానికి తెరపడటం మూలంగా బుచ్చమ్మ లోపలకు వచ్చింది

వరండాబయటే పచార్లు చేస్తూన్న మనుమడ్ని చూసి "ఏంబాబూ! భోజనం అయిందా ?" అన్నది

"ఊఁ — అయింది అమ్మమ్మా."

"మరి, అమ్మాయేది ?"

"లోపల ఉన్నట్లున్నాది" బుద్ధిమంతుడిలా సమాధానం ఇచ్చాడు

"అయ్యో! ఒక్కర్తే భయపడుతుందో, ఏమో! ఇక్కడికే వచ్చి కూర్చోమంటే బాగుంటుంది కదా." ఆయాసపడుతూ గబగబా లోనికి వెళ్ళింది.

క్రొత్తకోడలు పిల్ల తలుపులన్నీ జాగ్రత్తగా మూసి, గడియలు వేస్తున్నాది.

"నాతల్లే! తలుపులు వేస్తున్నావా!" మురిపెంగా అంటూ మెటికలు విరిచింది.

కాస్త సిగ్గుగా నవ్వింది తార.

ఆ రాత్రివూట ... ... లేత వెన్నెట్లో, కొబ్బరి ఆకుల నీడలక్రింద, పరిసరాలను తమ సువాసనలతో ఆహ్లాదపరిచే జాజిపందిరి పక్కగా తన మంచంపై పడుకుని భార్యతో చాలాసేపు కబుర్లు చెప్పారు వెంకటరత్నం.

మొదట బుచ్చమ్మ కూడా వీళ్ళ దగ్గరే కూర్చున్నాది. వెంకటరత్నం పార్టీ కబుర్లు



మీకు మీరుగాగమనించండి !

## ఇతర డిటర్జెంట్ ఉతికే బిళ్ళ లకన్నా బరువు రెండు రెట్లు ఎక్కువ. ధర కేవలం కొద్ది పైసలు ఎక్కువ!

300 గ్రాములు రూ. 3.20 (స్థానిక పన్నులు అదనం)

# టోటల్

## నీలి డిటర్జెంట్ ఉతికే బార్




### మొదటి "నిజమైన" డిటర్జెంట్ బార్!

టోటల్ - ఉతికే బార్ రీతిలో ఉన్నది మరియు అధికమైన శుభ్రపరిచే నీలి డిటర్జెంట్ శక్తి ఉన్నది మరి ఇంకేమి? పొదుపుగ ఉతికేందుకుగాను ఇది ఐదు చేతికనువైన భాగాలు కలిగివుంది

### కేవలం కొద్దిపైసల హెచ్చుకే రెండు రెట్లు బరువు!

ఒక నిర్దిష్టమయిన డిటర్జెంట్ కేక్ 125 గ్రాముల బరువు కలదానికి మీరు ఎంత ఖర్చుపెడుతున్నారు?
250 గ్రాముల "టోటల్" ధర కేవలం రూ. 2 67
(300 గ్రాములకి రూ 3 20) అదీను మామూలు డిటర్జెంట్ కేక్‌లకన్న రెండు రెట్లు బరువు ఎక్కువ కేవలం కొద్ది పైసలహెచ్చుకే!




ఉతుకుటకు చేతికనువుగా ఐదు భాగాలు.

### ఆంధ్రప్రదేశ్, బీహార్ మరియుతమిళనాడులలో దొరుకును.

కర్నాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్,బెంగుళూరు వారిఒక నాణ్యమయిన ఉత్పాదన
మార్కెట్ చేయువారు మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు

MCA-TDB-51-Tel

ప్రారంభించేసరికి లేచివెళ్ళి వీధి అరుగుల మీద కూర్చుని మళ్ళీ నాటకం చూడటంలో నిమగ్నురాలయింది.

పార్టీ అంటే ఏమిటో అసలేమీ తెలీని తారకు, అందులో అ ఆలు కూడా రాని తారకు ఆ పార్టీని గూర్చి ఎన్నెన్నో కబుర్లు, తనకున్న ఆశయాలు, తనుచేసే పనులూ, ఇంకా తను చేయాల్సిన విధులూ, తన కార్యనిర్వహణలో తార ఏ విధంగా చేయూతనివ్వాలో – తార వెంట వెంటనే వస్తూన్న ఆవలింతల్ని ఆపుకోవటానికి పడుతూన్న అవస్థను గమనించేవరకూ చెబుతూనే ఉన్నాడు వెంకటరత్నం

* * *

వెంకటరత్నం బి.ఏ. అయిపోయింది. కానింగు కంపెనీలో ఉద్యోగం దొరకటమూ, చేరటమూ వెనువెంటనే జరిగిపోయాయి.

అప్పటికి పెళ్ళి అయి ఆరునెలలు అవుతున్నాది. పెళ్ళి జరగంగానే అత్తవారింట్లో చేసిన మూడు నిద్రలూ, నెలలోపున ఒకసారి వెళ్ళి మరో రెండు రోజులు ఉండిరావటమూ – కొన్ని సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనల్లాగా అన్పిస్తున్నాయి తారకు. మొదటిసారి వెళ్ళినపుడు – చివరిరోజున... ఇంట్లో ఎవరూలేని సమయంలో...భర్తసమక్షంలో గడిపిన ప్రతిక్షణం మర్చిపోలేని సంఘటనలై మనసులో చోటు చేసుకున్నాయి.

నిర్మలమైన మనస్సు! వికసించుతూన్న వయస్సు! తెల్లటి క్రొత్తబట్టపై పడిన రంగు పొనట్లే – ఆ వయసులో మనసున ముద్రపడిన భావాలు కూడా చాలా బలంగా నాటుకుంటాయి.

రెండోసారి తార అత్తవారింటికి వెళ్ళినప్పుడు వెంకటరత్నం ఊర్లోనేలేడు. కాకినాడలో జరుగుతూన్న మీటింగుల్లో పాల్గొనటానికి వెళ్ళాడుట. తార ఉన్న రెండు రోజుల్లోనూ అతను రానే లేదు. అతని కోసం ఎంతగానో ఎదురుచూసిన తార నిరాశతోనే పుట్టింటికి వచ్చేసింది.

సరళ భర్త ప్రకాశరావు వారానికోసారి గుడివాడ నుండి నరాసరి చౌటపల్లికే వచ్చేసేవాడు. అలా వచ్చినవాడు ఏ సాయంత్రానికో వెళ్ళేవాడుకాదు. రెండురోజులు ఇక్కడే ఉండిపోయేవాడు. ఆ రెండు రోజులూ షాపుకు వెళ్ళేవాడు కాదు.

## తార

మొదట్లో రాఘవయ్యగారు నవ్వుకునేవారు. తర్వాత ఆశ్చర్యపోయేవారు. మరికొన్నిసార్లు అలాగ వచ్చాక విసుక్కుంటుండేవారు. ఇప్పుడిప్పుడు—అల్లుడు అలా బాధ్యతా రహితంగా ప్రవర్తించటం చూస్తే కోపం వస్తున్నాది. కానీ – పైకి ఏమీ అనేవారు కాదు. అంటే నాగరత్నమ్మ ఊరుకోదు.

ఆమెకు పెళ్ళి అయ్యాక మళ్ళీ ఒక్కసారి కూడా ఇటువైపుకు తొంగిచూడని పెద్దఅల్లుడంటే ఎందుకోగానీ అంత మంచి అభిప్రాయం ఏర్పడలేదు

వారానికోసారి వచ్చి రెండు మూడురోజులు తిష్ఠవేసి 'అత్తమ్మా, అత్తమ్మా' అంటూ పిలుస్తూ, రోజుకు కనీసం ఆరుగంటల సేపయినా రకరకాల కబుర్లు చెప్పే చిన్న అల్లుడంటే అమితమైన అభిమానం! ఆ అభిమానం ఎంత వరకూ పెరిగిందంటే – అతడెపుడయినా తలనొప్పి అన్నాడు అంటే – ఎంత పనిలోఉన్నా ఆ పనులన్నీ ఎక్కడి వక్కడ వదేసి, అమృతాంజనం తీసుకుని అతడి మంచంపైనే కూర్చుని తలకు మర్దన చేసేది! దృష్టితీసి పోసేది! నిమిషానికోసారి ఎలా ఉందో, ఏమిటో, జ్వరంగాని వచ్చిందా అంటూ నుదురు, చేతులూ పట్టుకుని చూసేది! తత్తర బిత్తర అయిపోయేది!

ఆవిడ మనసులో రామారావుకీ, ప్రకాశరావుకీ తేడాలేదు! కానీ ఆ రోజుల్లో అల్లుడికి అత్తగారు కన్పించేవారుకాదు! ఏ తలుపుచాటునో నిలబడి క్షేమసమాచారాలు క్లుప్తంగా అడిగి తెలుసుకునేవారు! అలాంటి రోజుల్లో నాగరత్నమ్మ చూపే పిచ్చిప్రేమకు అత్తా, తోడికోడళ్ళూ, ఇరుగూ, పొరుగూ నోళ్ళు నొక్కుకునే వారు.

ఇవేవీ తారకు తెలిసేవికావు! తన పనులేవో, తనమో! ప్రతివారం క్రమం తప్పకుండా వెంకటరత్నం ఒక ఉత్తరం వ్రాసేవాడు! ఆ ఉత్తరంతో పాటుగా ఒక పుస్తకం కూడా పంపేవాడు! అలా వచ్చే పుస్తకాలన్నీ దాదాపు పార్టీ గొడవలతోనే నిండి ఉండేవి! మొదట్లో అవి అర్థంకాకపోయినా భర్తపైన ఉండే గౌరవంకొద్దీ కష్టపడి మరీ చదివేది! చదివినకొద్దీ అవన్నీ క్షుణ్ణంగా అర్థమవసాగాయి. ఆ పుస్తకాలమీద తార అభిప్రాయాలు అడుగుతూ ఉత్తరాలు వ్రాసేవాడు తార వ్రాసే జవాబులమీద సునిశితమైన విమర్శలు వ్రాసేవాడు! తార అర్థం చేసుకున్నతీరులో ఏదైనా పొరపాటుంటే -- దాన్ని అర్థంచేస్తూ పేజీలకు పేజీలు వ్రాసి పంపేవాడు! అవి చదువుతూంటే వెంకట్ ఎదురుగా కూర్చుని తారకు విడమర్చి చెబుతున్నట్లుగానే ఉండేవి! ఒకమాటలో చెప్పాలంటే వెంకటరత్నం తారకు ఒక గొప్ప గురువు! అతడి ఉత్తరాలతో తార ఎంతో విజ్ఞానాన్ని సంపాదించింది! తార మనసులో వెంకటరత్నానికి ఉన్నంత ఉన్నతమైన స్థానం మరెవరికీ, చివరకు దేవుడికి కూడా లేకుండా పోయింది!

అతనిపై గౌరవం పెరిగిన కొద్దీ, భక్తి పెరిగినకొద్దీ, ప్రేమ పెరిగినకొద్దీ – అతడ్ని చూడాలనే కోరిక కూడా పెరుగుతున్నాది! 'ఇపుడు ఎలా ఉన్నారో! అపుడు సన్నగా, పొడవుగా రాజకుమారుడిలా ఉండేవారు! మరి, ఇపుడు ... ...' ఊహాలు పెరిగినకొద్దీ బెంగకూడా ఎక్కువ అయ్యేది.

దీనికితోడు ప్రకాశరావు రాకపోకలు తారలోని బెంగను అసంతృప్తిగా మారుస్తున్నాయి!

ప్రకాశరావు పనులు వెడగొట్టుకుని ఇలా రావటం రాఘవయ్యగారికి సుతరామూ ఇష్టముండేది కాదు. కాని, 'రావద్దు' అని కరాఖండిగా ఎలా చెప్పాలా' అని పెద్ద ఆలోచనలో పడిపోయారు

'ఆ పెద్ద అల్లుడ్ని రమ్మంటే రాడు; ఈ చిన్న అల్లుడ్ని వద్దంటే వినడు' అనుకునేవారు విసుగ్గా.

ఆ సమయంలోనే ప్రకాశరావు తల్లికి జబ్బు ఎక్కువైంది. గుడివాడ తీసుకొచ్చి డాక్టరుకు చూపెట్టారు. అక్కడే ఆసుపత్రిలో ఒక వారం రోజులు ఉండిపోయింది. ఆ సమయంలో ఇంటెడు చాకిరీ తారపై వదిలి నాగరత్నమ్మా, సరళా గుడివాడలోనే ఉన్నట్లుగా ఉండేవారు. ఉదయం ఎనిమిదిగంటలకల్లా భోజనాలుచేసి ప్రకాశరావుకి క్యారియర్‌లో పెట్టుకుని వెళ్ళిపోయేవారు. మళ్ళీ రాత్రికి తిరిగి వచ్చేసరికి ఎనిమిదో, తొమ్మిదో దాటిపోయేది. అక్కడ ఏం చేసేవారో, ఏమోగాని ఇంటికి వచ్చాక, వాళ్ళుపడే ఆపసోపాలు చూస్తే మాత్రం అక్కడ ఇటికలు మోసారో, బియ్యం దంచారో అనిపిస్తుంది.

ఆమెకు కాస్త తగ్గాక 'ఇంక ఇంటికి తీసుకెళ్ళవచ్చు' అన్నారు డాక్టర్లు. "అక్కడ చూసేవాళ్ళు ఎవరున్నారు. ఆవిడ కాస్త లేచి తిరిగేవరకూ మవింట్లోనే ఉంటారు" అని నాగరత్నమ్మ చౌటపల్లికి తీసుకొచ్చింది.

వరండాలో కూర్చుని కాఫీ త్రాగుతూన్న రాఘవయ్యగారు బండిలోనుంచి దిగుతూన్న ఈ జనాన్ని చూసి ఆశ్చర్యంతోనూ, కోపంతోనూ ఊగిపోయారు. కాని, నోరుతెరచి అందరిముందూ బయటపడటం తన పెద్దరికానికే అవమానమని భావించి కండువా దులిపి భుజాన వేసుకుని పెద్ద పెద్ద అంగలేసుకుంటూ బయటకు వెళ్ళిపోయారు.









ఆ రావటం – రావటం... మూడు మాసాల పాటు ఇక్కడే ఉండిపోయారు. తల్లితోపాటు తమా ఇంట్లోనే ఉండిపోతూన్న ప్రకాశరావుతో ఒకసారి రాఘవయ్యగారు కోపాన్ని మింగుకుని ముభావంగా అన్నారు –

''నువ్వు ఎందుకు ఇంట్లో కూర్చోవటం! నువ్వుకూడా పనులు మానుకుని ఇక్కడే ఉండాల్సినంత అనారోగ్యం ఏమీలేదుగా మీ అమ్మగార్కి! ఉదయం వెళ్ళి సాయంకాలం రా.''

ఇంక ఆనాటినుంచీ అలాగే చేసేవాడు ప్రకాశరావు.

ఆమెగారి ఆరోగ్యం చక్కబడి ఆవిడ వాళ్ళింటికి వెళ్ళిపోయేనాటికి అసలే సన్నగా ఉండే తార మరీ చిక్కిపోయింది. సరళ పనిచేసేది కాదు! ఏం చేసేదో, ఏమోగానీ ఎపుడూ అత్తగారి గదిలోనే ఉండేది. ఆవిడగార్కి జావలూ, రసాలూ, మందులూ – అన్నీ నాగరత్నమ్మే జారేసేది! ఆవిడగార్ని చూడటానికని ఆవిడ బంధువులు ఎవరెవరో వస్తుండేవారు. నాగరత్నమ్మకు వాళ్ళతో కబుర్లు చెప్పటానికే కాలం సరిపోయేదికాదు! ఇంక ఇంట్లోవాళ్ళకూ, వచ్చిపోయే బేవార్సుగాళ్ళకూ అందరకూ వండి వార్చాల్సిన పని తార నెత్తిన పడింది ఎపుడూ క్షణం కూడా తీరేదికాదు. అలాగ కష్టపడుతూన్న తారను చూస్తే రాఘవయ్యగారికి కోపం కట్టలు త్రెంచుకునేది! చివరకు చంద్రం, మోహన్‌లు కూడా వాళ్ళపైన విసుక్కుంటూ అక్కను సానుభూతిగా చూసేవారు! వాళ్ళకు చేతనైనంతవరకూ అక్కకు సహాయపడాలి అని తాపత్రయపడేవారు! కాని సరళకూ నాగరత్నమ్మకూ మాత్రం కొంచెమైనా ఆలోచన ఉండేదికాదు! పైగా ఏ పనిలో అయినా కాస్త ఆలస్యం జరిగినా, ఏదైనా వంటకంలో రుచులు అటూ ఇటూ అయినా పెద్ద నోరుపెట్టి కసురుతుండేది! 'సవతి కూతురా ఏమిటి' అన్పించేట్లుగా ప్రవర్తించేది! అలాంటి సందర్భాల్లో ఒకటి రెండు సార్లు రాఘవయ్యగారు గమనించి నాగరత్నమ్మను చాటుగా, మెల్లిగానే అయినా ఘాటుగా మందలించారు. అయినా ఆవిడ దాన్ని అపుడే వదిలేస్తుంది!– మళ్ళీ పాతపాటే!

## తార

ఈ పనుల్లో పడిపోయి వెంకటరత్నం పంపే పుస్తకాలు చదవటమేలేదు. అసలు వారానికోసారయినా తృప్తిగా ఉత్తరం వ్రాయటానికే తీరిక దొరకటంలేదు! అలాంటపుడు ఇంకా పుస్తకాలెక్కడ చదువుతుంది! అయినా వెంకటరత్నం పుస్తకాలు పంపుతూనే ఉన్నాడు.

''వారానికో పుస్తకం చదవలేకపోతున్నాను'' అంటూ ఒకసారి తార వ్రాసిన ఉత్తరానికి జవాబుగా ''ఏయ్, మొద్దూ! వారానిక్కూడా ఒక పుస్తకం చదవలేకపోతే – నీ జీవితకాలంలో నువ్వు నేర్చుకోవలసిన విషయాల్లో కనీసం అరవయ్యో వంతుకూడా నేర్చుకోలేవు, తెల్సిందా! కనీసం నెలకో పుస్తకమయినా చదువు.'' అంటూ వ్రాసాడు.

అలా వచ్చిన పుస్తకాలన్నీ ఎంతో జాగ్రత్తగా, అపురూపంగా దాచుకునేది తార! అలా పుస్తకాలు రావటం ప్రకాశరావు నాలుగైదుసార్లు చూసాడు. ఆ విషయం గూర్చి అత్తగారి దగ్గర చాలా ఆరాగా అడిగాడు – ''మా అన్నగారు ఒదినగార్నికూడా రాజకీయ నాయకురాలిగా చేస్తున్నట్లున్నారే!''

మంచీ చెడూ ఆలోచించలేని నాగరత్నమ్మ చిన్న అల్లుడి ముందర పెద్ద అల్లుడ్ని ఈసడించి పారేసింది! అనమానకరంగా మాట్లాడింది! 'ఎందుకూ పనికిరానివాడు'గా జమకట్టి హేళన చేసింది! ఒక్కసారికూడా రానందుకు అతణ్ణి 'చేతగానివాడు'గా వెక్కిరించింది

### దూరపు కొండలు

స్వప్న జగత్తు
రంగుల మయం
సినీ జగత్తు
శృంగార విలయం
సినశైవ జగత్తు
కరువుల వలయం

—''శ్రీవాణి''

వాళ్ళిద్దరూ కలిసి అతన్ని అలా అసభ్యంగా అవమానిస్తుంటే తార హృదయం భగ్నమవుతున్నాది! బంగాళాఖాతంలో ప్రారంభమైన ఉప్పెనలాగా తీవ్రమైన కలకలం చెలరేగుతున్నాది. ఆమె మనసు ముక్కలు ముక్కలుగా చితికిపోయి చిత్రహింస ననుభవిస్తున్నాది కోపంతో, ఆవేశంతో, బాధతో ఆమె శరీరంలోని ప్రతి నరమూ కంపిస్తున్నాది! ప్రతి రక్తబిందువూ కాగి పొంగుతున్నాది! కాని, ఎలా బయటపడాలో, వాళ్ళను ఎలా ఎదుర్కోవాలో, భర్తని ఎలా సమర్థించుకోవాలో అర్థంకాక పెరటిలోకి పారిపోయి బాదంచెట్టు క్రింద మోకాళ్ళమధ్య తల ఉంచి వెక్కి వెక్కి ఏడ్చేసింది.

లోపల గదిలో ఉన్న రాఘవయ్యగారు ఈ మాటలన్నీ వింటూనే ఉన్నారు. బరబరా బయటకు వెళ్ళి ఇద్దర్నీ చెంపలదిరేలా కొట్టాలన్నంత ఆవేశం వచ్చింది. కానీ, ఆయనలో ఉన్న సంస్కారం, సభ్యత - అందుకు అడ్డొచ్చాయి! వెంటనే ఆయనకు తార గుర్తుకొచ్చింది. ఇల్లంతా వెతికి బయటకు వచ్చేసరికి బాదంచెట్టు క్రింద గువ్వలాగా ముడుచుక్కూర్చుని డొక్కలు ఎగిరెగిరిపడేలా వెక్కి వెక్కి ఏడుస్తూన్న కుమార్తెను చూసేసరికి ఆయనకు కూడా కళ్ళు చెమర్చాయి. మనసంతా బరువెక్కింది. దగ్గరకు వచ్చి ఆదరంగా భుజంపై చేయి వేసారు.

''నాన్నా'' భోరుమంటూ ఆయన గుండెలపై తలవాల్చిన కూతుర్ని పొదివి పట్టుకున్నారు. ఆమె తలపై చేయివేసి అనునయంగా సవరిస్తూ అన్నారు– ''ఆ దౌర్భాగ్యులకేం తెలుసమ్మా అతని గొప్పతనం! నీ భర్త ఔన్నత్యం, అతడి ఆత్మగౌరవం – వీళ్ళకు అర్థంకావు తల్లీ! సంస్కారం లేని ఈ మూర్ఖుల మాటలకు నువ్వేమీ బాధపడకు ధైర్యంగా అందర్నీ ఎదిరించి మరీ పెళ్ళి చేసుకున్నావు. ఆ ధైర్యంతోనే ఉండాలికానీ ఇలా బయటపడిపోగూడదు తల్లీ!'' అంటూ ఎన్నో ఓదార్పు మాటలతో ఆమెను సాంత్వన పరచటానికి ప్రయత్నించారు.

అది జరగాక తార మనసులో ప్రకాశరావంటే గడ్డిపోచకుండే విలువ కూడా లేకుండాపోయింది! కాని, తల్లి నోటికి భయపడి అతడికి మర్యాదలు చేస్తున్నాది.

(ఇంకా వుంది)



# మైసూర్ శ్యాండల్




**గొప్ప భారతీయ సంప్రదాయంలో**
**విశిష్టమైన స్నానపు సబ్బు**

కర్నాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగుళూరు (ముందటి గవర్న్మెంట్ సోప్ ఫ్యాక్టరి, బెంగుళూరు)
వారి ఒక నాణ్యమయిన ఉత్పాదన మార్కెట్ చేయువారు మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు

MCA-MSS-62-TEL

# మమకారం




గురజాడ శోభాపేరిందేవి

హడావిడిగా ఇంటికి వచ్చిన రామనాథం తాను తెచ్చిన విత్తనాలు అన్నీ సరిగ్గా ఉన్నాయో లేదో అని లెక్క చూస్తున్నాడు.

"ఏమండీ !"

"ఆ" అన్నాడు చకచకా తన పని చూసుకుంటూ !

"సెలవు రోజయినా ఇంటిపట్టున ఉండక ఇప్పటిదాకా తిరిగివచ్చారు. వచ్చాకనైనా నాతో కాస్సేపు కబుర్లు చెప్పరేమిటండీ ?"

"ఈ విత్తనాలు నాటేదాకా నాకు మనశ్శాంతి లేదు సీతా ! అయినా కొన్నాళ్ళాగు పూలతో, పండ్లతో, కాయకూరలతో, ఆకు కూరలతో మన ఇల్లు ఎంత కళకళలాడుతుందో ! అప్పుడు మనమిద్దరమూ చెట్లనీడల్లో కూర్చుని మన ఇంట్లో పండిన పండ్లుతింటూ, కబుర్లు చెప్పుకోవచ్చు. వృద్ధాప్యంలో ఇవి కాస్తూకూస్తూ ఆర్థికంగా సాయం చేస్తాయి తెలుసా ?"

ఈమాట విన్న సీత నవ్వకుండా ఉండలేకపోయింది. ఆ నవ్వులో విషాదం ఉంది. "వృద్ధాప్యంలో తోట ఆసరాగా నిలబడడమేమిటండీ ? అప్పుడు ఆసరాగా ఉండేది కొడుకులయితేనూ" అంది.

సీత కళ్ళలోకి చూసాడు రామనాథం. 'ఇవాళయినా డాక్టరుగారి దగ్గరికివెళ్ళి పరీక్ష చేయించుకుందామని అనుకున్నానండీ ! కానీ మీరి విత్తనాల గొడవలో పడ్డారు' అంటున్నాయి ఆమె కళ్ళు.

"సరేలే రెడీ అవ్వు డాక్టరుగారి దగ్గరికి వెడదాం ! వచ్చాక వీటి సంగతి చూస్తాను" అన్నాడు రామనాథం.

సీతకళ్ళు మెరిసాయి. నోరువిప్పి 'నా ఉద్దేశ్యం ఇది' అని చెప్పకుండానే మనసులోని మాట గ్రహించిన భర్తని చూసి గర్వపడింది.

చకచకా స్నానం చేసింది. చిలకాకు పచ్చ రంగులో ఉన్న వెంకటగిరి జరీచీర కట్టుకుంది. ఎర్రటి కుంకుమని అందంగా నుదుటమీద పెట్టుకుంది. దేముడు గదిలోకి వచ్చి నమస్కారం చేస్తూ నిలబడింది

"తండ్రీ నాతో పెళ్ళయిన వాళ్ళందరూ ఇద్దరు పిల్లలకి తల్లులయ్యారు. నాకంటే నాలుగేళ్ళు ఆలస్యంగ పుట్టిన చెల్లాయి, పెళ్ళై ఏడాది నిండకుండానే పండంటి పిల్లాడిని ఎత్తుకుంది. నేను పూర్వజన్మలో ఏం పాపం చేసానో, ఏ తల్లీ బిడ్డలను వేరు చేసానో కానీ పెళ్ళయ్యి పదేళ్ళయినా పిల్లనెత్తలేదు వీధి గుమ్మంలోకి రావాలంటే సిగ్గుతో తల ఒంగిపోతోంది.

పేరంటాలకి వెడితే ముత్తైదువల కళ్ళు అదోలా నావైపు చూస్తాయి. ఒకసారి పెళ్ళికి వెళ్ళాను. అందరిలాగే వధూవరుల నెత్తిమీద అక్షింతలు జల్లాను. అందరి కళ్ళు 'నువ్వు జల్లావేమిటి ?' అని ప్రశ్నించాయి.

ఓ పెద్ద ముత్తయిదువ "ఏమీ అనుకోకె పిల్లా ఇల్లా అన్నానని ! నీకు పిల్లలులేరు కదా ! కనక నీ చేతితో అక్షింతలు జల్లడం ఏమంత శుభదాయకం కాదే !" అంది.

'పురిటి నెప్పులు భరించలేక చనిపోయినా పరవాలేదు. ఆ రకంగా చనిపోతే జన్మనిచ్చిపోయింది అంటారు. కానీ నాలాగ గొడ్రాలిగా ఎన్నేళ్ళు బ్రతికినా ఏం లాభం ?'

'మా పల్లెలోని ఆడవాళ్ళంతా ఇంచుమించుగా నన్ను వెలివేసారు స్వామీ ! డాక్టరుగారు మా ఇద్దరిలోనూ ఏ లోపమూ లేదని చెప్పేలాగ ఆశీర్వదించు '

కాన్పు కష్టమై నేను పోయినా పరవాలేదు బిడ్డ మాత్రం బ్రతకాలి అలా ఓ తల్లిగానే నేను తనువు చాలించాలి "

సీతకళ్ళు అవిరామంగా వర్షిస్తున్నాయి. ముఖం ఎర్రగా కందిపోయి ఆమె నుదుటిమీది కుంకుమ బొట్టుతో పోటీ చేస్తోంది

"సీతా ! సీతా ! ఏమైంది సీతా ?" గాభరాగా భార్యని కుదిపి అడిగాడు రామనాథం

ఇంక భరించలేనట్లుగా అతని గుండెల్లో ముఖం దాచుకుని గట్టిగా ఏడవసాగింది సీత

"నేను గొడ్రాలినని దేముడికి కూడా నా మీద కోపమండీ! అందుకే ఎన్ని పుణ్యక్షేత్రాలని దర్శించినా, ఎన్ని మొక్కులు మొక్కినా నా మొర ఆలకించడం లేదండీ ! నన్ను ఇలాగే ఉండిపొమ్మంటున్నాడండీ!"

"సీతా ఇలా చూడు !" ఆమె ముఖాన్ని పైకెత్తుతూ అన్నాడు రామనాథం.

"ఏమిటి ?" అన్నట్లుగా చూసింది సీత.

"డాక్టరుగారి దగ్గరకి ఇప్పుడే వెడదాం ! కానీ ముందుగా గుండెని నిబ్బరంగా చేసుకుని బయలుదేరు ! ఎందుకంటే మనం కోరుకున్న విషయమే జరుగుతుందన్న గ్యారంటీ లేదుగా !

అయినా పిల్లలకోసం అంతగా తహతహలాడటావెందుకు ? తల్లిదండ్రులం వాళ్ళని ఎంతో

ఘనమైన సేవతో

Indian Bank
SAVINGS PASS BOOK

# సేవింగ్స్ బ్యాంక్ అకౌంటు

ఇండియన్ బ్యాంక్ తన వద్ద సేవింగ్స్ బ్యాంక్ ఖాతా ప్రారంభించ మిమ్ము ఆహ్వానిస్తున్నది.

మీరు యీ ఖాతాను రు. 5/- మాత్రం చెల్లించి ప్రారంభింపవచ్చు మీ అద్దెలు, ప్రీమియం, డబ్బు మార్పులు, లేక ఆయాకాలపు యితర చెల్లింపులకు మీ స్థిరమైన ఉత్తర్వులన్నియు యెప్పటికప్పుడు నిర్వహింపబడును. మీ చెక్కులు, డివిడెండ్ వారంట్లు, పెన్షన్ చెల్లింపులు వసూలు చేయబడును.

మరియు సాలుకు 5% వడ్డీకూడా!

ఇందుకు సంబంధించిన పూర్తి వివరములకు మరియు అనేక యితర ఆకర్షణీయమైన ప్రణాళికలకు మీ సమీపమందున్న ఇండియన్ బ్యాంక్ బ్రాంచిని తప్పక సంప్రదించండి.






## ఇండియన్ బ్యాంక్

మీ సుఖసమృద్ధికి సహకారి

ADWAVE/IB/1875/S1 TEL

అపురూపంగా పెంచితే, వారు కాళ్ళమీద నిలబడగానే మనలని మన పాటికి వదిలేసి వెళ్ళిపోతారు. అప్పుడు బోలెడంత బాధపడాలి. ఆ బాధంతా ఎందుకు? అయినా ఇవాళ నేను నాటే ఈ విత్తనాలు మొక్కలై మనకళ్ళ ఎదుటే పచ్చగా కళకళలాడుతూ పెరిగి పెద్దవుతాయి. వాటిని మన పిల్లలలాగా భావించ లేవా?''

తను ఇంక ఇలా ఏడుస్తూ ఉంటే డాక్టరుగారి దగ్గరకు తీసుకువెళ్ళే ప్రయత్నం మానేస్తాడేమోనని భయపడిన సీత ''నేను అన్నిరకాల అవమానాలు భరించి వచ్చినదాన్ని. ఎన్నోసార్లు తూట్ల లాంటి మాటలు పడ్డాను కూడా! అన్ని గాయాలకీ ఇదో దెబ్బగా భావిస్తాను'' అంది.

దేముడికి మరోసారి దణ్ణం పెట్టుకుని భర్తతో నడిచింది సీత.

* * *

డాక్టరుగారి ఆపరేషన్ వల్ల నయితేనేమి, సీత మొక్కుల వల్లనయితేనేమి ఆమె గర్భవతి అయింది.

''నువ్వు చాలా బలహీనంగా ఉన్నావు. కాన్పు కష్టమవుతుందేమోనమ్మా! అదీకాక నీకు ముప్పై నిండాయి కూడాను!'' అంది డాక్టరు.

''ఏం ఫరవాలేదు డాక్టరుగారూ! బాబు పుట్టగానే వాడి బోసినవ్వులు చూడగానే వాడు ఆరోగ్యంగా తయారవ్వగానే నేను బాగా ఆరోగ్యాన్ని పుంజుకోవడమే కాదు లావవుతాను కూడా! అప్పుడు మీరే నన్ను గుర్తుపట్టలేరేమో!'' నవ్వుతూ అంది సీత.

సీత పుట్టబోయేవాడి కోసం స్వెట్టరు, మేజోళ్ళు అల్లింది. బొంతలు తయారుచేసింది. బొమ్మలు, బట్టలు కొంది.

''అబ్బాయే పుడతాడని అంత నమ్మకంగా ఎలా చెప్పగలవు సీతా?'' అని అడిగాడు ఒకసారి రామనాధం.

''నాకు మగపిల్లాడే పుడతాడండీ! ఏడుకొండల వాడిమీద నాకు బాగా నమ్మకం ఉంది. మీకు వంశోద్ధారకుడిని కనివ్వకపోతే అప్పుడడగండి'' అంది సీత.

అందంగా, ఆనందంగా ఉన్న భార్యని చూసి తృప్తిగా నిట్టూర్చేవాడు రామనాధం.

అతను ఎంతో ఇష్టంగా తోటపని చేసేవాడు. ఏ పాదు అయినా కాపేస్తే, ఏ గులాబి మొక్కో మొగ్గల్ని తొడిగితే సంబరపడిపోయేవాడు.

సీత మగపిల్లాడిని ప్రసవించింది. చాలా బలహీనంగా తయారైన సీతకి ఎన్నో జాగ్రత్తలు చెప్పింది డాక్టరు.

బుద్ధిగా తల ఊపిందేకానీ ఆమె డాక్టరుగారి మాటలని పెద్దగా పట్టించుకోలేదు. ఎప్పుడూ కొడుకుమీదే ధ్యాస! రామనాధం బలవంతంగా ఇస్తే టానిక్కు తాగేది.

తను పక్కగదిలోకి వెడితే చాలు తనకోసం ఏడ్చే కొడుకుని చూసి మురిసిపోయేది. బారసాల, అన్నప్రాసన, మొదటి పుట్టినరోజు చాలా ఘనంగా తన శక్తికి మించే చేసాడు రామనాధం.

కొడుకు శ్రీనివాస్‌ని ఎత్తుకుని తీపిగా తిరగ

# మ మ కా ర ం

సాగింది సీత. రామనాధం కొడుకుమీద మరీ అంత మమకారం పెంచుకోవద్దని హెచ్చరించేవాడు. అతనామాట అన్నప్పుడల్లా ఆమెకీ చాలా కోపం వచ్చేది.

శ్రీనివాస్ అతి గారాబంగా పెరిగాడు. తన ఇష్టప్రకారమే అన్నీ జరగాలి. 'తను పట్టిన కుందేటికి మూడేకాళ్ళు' అని వాదించే విధంగా తయారయ్యాడు. అలా పెరిగిన అతను ఏ క్లాసు లోనూ తనంతటతాను పాసవ్వలేదు. తండ్రి బడిలో టీచరు కావడంతో పదో క్లాసువరకూ లాక్కొచ్చాడు పదోక్లాసు రెండేళ్ళు చదివి పట్నంలో జూనియర్ కాలేజీలో డొనేషన్ కట్టి చేరాడు. 'మెడికల్ కాలేజీ'లో కూడా అలాగే చేరాడు. 'గజనీ మహమ్మదు' చేసిన దండయాత్రల మాదిరి ఎన్నో ఏళ్ళు చదువు వెలగబెట్టి చివరికి ఎలాగో డాక్టరయ్యాడు

ఆ రోజు సీత ఆనందానికి అంతేలేదు. ప్రసవం అయినప్పటినుండి ఆరోగ్యం చెడిపోయిన ఆమె ఇప్పుడు మరీ డొక్కులాగ తయారయ్యింది 'మా వాడు డాక్టరయ్యాడు.' 'ఈ ఊర్లో ప్రాక్టీస్ చేస్తాడు మా అబ్బాయి!' అని ఇంటింటికిపోయి చెప్పివచ్చింది. రామనాధంకి కూడా సంతోషం కలిగింది. 'నేను హైదరాబాద్‌లో ప్రాక్టీస్ పెడతాను!' అని శ్రీనివాస్ అనడం విని అతను చాలా బాధపడ్డాడు. సీత వద్దని పదేపదే చెప్పింది.

''మీరుకూడా నాతో రండి'' నాలిక చివరినుండి అన్నాడు శ్రీనివాస్.

ఏపుగా ఎదిగి కాయలతో నిండుగా ఉన్న చెట్లు 'మమ్మల్ని వదిలి వెళ్ళిపోతావా?' అని మూగగా అడుగుతున్నట్లనిపించిందతనికి. ఏదో అర్థంకాని ఆ అనుబంధానికి విలువనిచ్చే అతను ''నేనెలా వస్తానురా?'' అన్నాడు.

''రిటైర్ అయిపోయావుగా! ఇంకేం పని?''

''అయనెప్పుడు నా మాట విన్నాడుకనక? పోనీ నువ్వు రా అమ్మా!''

రామనాధం కొడుకు ముఖంవైపే చూస్తూ నిలబడ్డాడు. కొడుకు తల్లిని రమ్మని పిలవడానికి కారణం హోటలునుండి భోజనం తప్పించుకోవడమే అనిపించింది అతనికి.

సీత అతన్ని బ్రతిమాలి ఫలితం కనబడక కొడుకుతో బయలుదేరింది. రామనాధం తోటలో ఒంటరిగా మిగిలిపోయాడు.

* * *

''ఏమండీ!''

దేముడి పూజకోసం పూలు కోస్తున్న రామనాధం ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు. బాగా నల్లబడి, చిక్కిపోయి ఉన్న సీతని చూసి నివ్వెర పోయాడు.

''రా సీతా కూర్చో! అలా అయిపోయా వేమిటి?'' మంచినీళ్ళ గ్లాసు ఆమె చేతికి అందిస్తూ అన్నాడు రామనాధం.

నీళ్ళు తాగేసి గ్లాసుని కిందపెట్టి చెట్లనీడలో వేసివున్న నవారుమంచంమీద కూర్చుంది సీత.

''ఏమండీ నన్ను క్షమిస్తారా?''

''అదేంమాట సీతా? నువ్వేం తప్పు చేసావని క్షమించాలి?''

''నేను ఇప్పటిదాకా చేసినవి అన్నీ తప్పులేనండీ మీరెంత చెప్పినా పిల్లలో అని కొట్టుకుపోయాను మంత్రాలయంలో తడిబట్టలతో నేలమీద దొర్లుతూ ప్రదక్షిణాలు చేసాను. పిల్లలు పుడతారన్న ఆశతో ఎవరేం తినమన్నా తిన్నాను. ఒకటా రెండా ఎన్ని ప్రయత్నాలు చేసాను నేను! నా ప్రాణాలు పోయినా ఫరవాలేదు కానీ నా బిడ్డ బ్రతకాలి. ఓ తల్లిగానే నేను ప్రాణాలు వదలాలి అనుకున్నాను. అడిందే ఆటగా పాడింది పాటగా పెంచాను.

ఇప్పుడు గొడ్రాల అని అందరూ అవమానించిన దానికి పదింతలుగా అనుభవించానండీ!

వాడు చెప్పాపెట్టకుండా ఎవత్తెనో తీసుకు వచ్చి 'నా పెళ్ళాం' అన్నాడు. ఆ రోజే కాస్త మనసు విరిగిన నేను ఇక్కడికి వచ్చేద్దామనుకున్నాను

కానీ వాడు ఎంతో వేడుకోవడంతో ఆగి పోయాను. కొద్ది రోజులు పోయాక పెళ్ళాన్ని తీసుకుని మీదగ్గరికి వచ్చి ఆశీర్వాదం తీసుకుంటా నన్నాడు.

నేను వాడి పద్ధతిని హర్షించకపోయినా సరిపెట్టుకున్నాను

ఓ రోజు వాడి పెళ్ళాం ''మీ అమ్మ ఎందుకు మన ఇద్దరికీ మధ్య? మీ ఊరుకి పంపించెయ్యి ముసలాళ్ళంటే నాకు బోరు'' అంది విసుగ్గా

''మా అమ్మని ఇక్కడ ఉంచడానికి గల కారణం ఏమిటనుకున్నావు? నీక్కు మంచి చేసే ఉద్దేశ్యమే! పనిమనుష్యులు ఇక్కడ సరిగ్గా దొరకరు దొరికినా మా అమ్మలాగ బాగా చెయ్యరు. వంటవాళ్ళు అసలే దొరకరు. అలాంటప్పుడు వంట+పని చేయగల మనిషిని నీకు అందిచ్చిన నన్ను అభినందించాలి'' అన్నాడు.

ఇప్పుడు నాకు ప్రతీ ఆడదాని దగ్గరికీ వెళ్ళి పనిగట్టుకుని 'గొడ్రాలిగా ఉన్నా ఫరవాలేదు కానీ ఇలాంటి కొడుకుని మాత్రం కనకు' అని చెప్పి రావాలని ఉందండీ!'' పిచ్చిపట్టిన దానిలా మాట్లాడుతూ, పూనకం వచ్చినదానిలాగ ఊగిపోతూ అంది సీత.

''నేను ఆనాడే చెప్పాను సీతా! నీకు విసుగేసింది కూడా! నన్ను చూడు! నేనూ పెంచుకున్నాను మమకారాన్ని! అయితే నీలా కొడుకు మీదకాదు! ఈ చెట్లమీద పెంచుకున్నాను. పెంచను సరిగ్గా అందని నాకు ఇవి ఆర్థికంగా సాయపడుతున్నాయి. వాటికి నేను చేసినదానికి రెట్టింపుగా ఫలితాన్నిస్తున్నాయి!'' అన్నాడతను గర్వంగా.

''నిజమే!'' ఒప్పుకుంది సీత.

''మాకీ తృప్తి చాలు!'' అంటున్నట్లుగ కదిలాయి కొబ్బరి ఆకులు. రేడియో పెట్టి నట్లున్నారు పక్కింటి పిల్లలు. పాటలు వినిపిస్తు న్నాయి. ఓ పాటయితే ఈ విధంగా ఉంది—

''మనిషిని నమ్మితే ఏముంది? కొబ్బరిచెట్టుని నమ్మితే ఎంతుందో! ఉండేందుకు నీడిస్తుంది, తినడానికి కాయిస్తుంది. తాగేందుకు నీరు, కాల్చేందుకు కట్టెలు ఇస్తుంది. మనిషి పోతే మోసేందుకు వాసిస్తుంది. కన్నబిడ్డ ఏమిస్తాడు? కోపాలు, తాపాలు, కన్నీళ్ళు తప్ప!'' ★

దేశమంతటా నాగరీక యువతులు కోరి
ధరించేది ఐటెక్స్ తిలకం నారీమణుల పుష్ప
విధానాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం
చేసేటందుకే కన్నులకింపైన 14 రంగులలో
దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో
తయారుచేయబడు ఐటెక్స్ తిలకం
చర్మానికి ఎటువంటి హానియు కలుగజేయదు



# ఆనందాల పంట
# ...దాన్ని పెంచి పోషించేది జై కిసాన్

జైకిసాన్ మీ పంటలను పెంచి పోషిస్తుంది, మీ కలల్ని నిజమని నిరూపిస్తుంది. అధునాతనమైన సాంకేతిక పరిజ్ఞానం ఆధారంగా గల జైకిసాన్ శక్తివంతమైన ఎరువులు భూమిలో వెంటనే కరిగి మీ పంటలకు అపారమైన శక్తినీ, తక్షణమైన పెరుగుదలనూ చేకూరుస్తాయి. మీ పైర్లతోపాటే మీ భాగ్యంకూడా వికసిస్తుంది ...మీకు హెచ్చు దిగుబడినీ, దాంతోపాటు హెచ్చు సంపదనూ ఇస్తుంది జైకిసాన్. గుర్తుంచుకోండి, ప్రతి పంటకు, ప్రతి భూమికి అవసరానికి తగిన పాళ్లలో వేయడానికి జైకిసాన్ ఎరువు ఉంది. జైకిసాన్ ఎరువుల విస్తృతమైన శ్రేణిలోంచి మీరు మీకు కావలసినదాన్ని ఎంచుకోవచ్చు.

లింటాస్-ZUA 91-203A TL

చిత్రవధ చేస్తాను. ముక్కలు ముక్కలుగా నరికి–''

''విజయ్, ఇప్పుడు కావల్సింది ఆవేశం కాదు; ఆలోచన. తొందరపాటుతో మనం ఏం చేసినా – అది పొరబాటే అవుతుంది. ఇంకా కొంతకాలం ఇలాగే మతి లేనట్లుగానే ప్రవర్తించాలి. మనం తెలివి తేటలతో జాగ్రత్తగా ఇక్కడ నుంచి తప్పించుకోవాలి,'' అని భగవంతం అంటూండగా స్మ్రాట్ అటుకేసి రావడం చూసి విజయ్ హఠాత్తుగా ''ఒరేయ్, ముసలాడా! నన్ను కొట్టడానికి ఎన్ని గుండెలురా నీకు?'' అన్నాడు

స్మ్రాట్ అర్థంకాక ''పార్ట్‌నర్! వాటీస్ దట్?'' అన్నాడు.

''చూడు, పార్ట్‌నర్! ఆ ఫార్ములా విషయం తెలుసుకుందామనివస్తే, నన్ను చూడగానే 'నా కన్న కొడుకువి. నేను నీ కన్నతండ్రివి' అని ఒకటే గోల.



'మరోమలుపు'లో గీత

కాదయ్యా, స్వామీ – అంటే, రక్తం వచ్చేట్టు కొట్టాడు,'' అన్నాడు విజయ్.

''నేను చెప్పానుగా – వీడు పిచ్చోడు; ఒటు రాకూడదని?'' అన్నాడు స్మ్రాట్.

''ఇతన్ని ...''

''నో నో నో! యు షుడ్ నాట్ కిల్ హిమ్... ఇతన్ని చంపకూడదు. ఇతనితో చాలా పనుంది. ఆ పని కాగానే నీకప్పజెప్తాను. నీ ఇష్టమొచ్చినట్టు చేసుకుందువుగాని ... కమాన్!''

''ముసలాడా! ఈసారికి బ్రతికిపోయావ్! మళ్ళీ వస్తా ... నీ ఎముకలేరేస్తా ... చూర్ణం చేస్తా,'' అంటూ తండ్రికి ఏదో సైగచేసి విజయ్ బయలుదేరాడు.

కె. ఛటర్జీ నిర్మించే ''మిస్టర్ విజయ్'' చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.

## బంగారు భూమిలో

## పందికొక్కుల పన్నాగం



దేవాలయం ప్రాంగణంలో ధర్మారావు (గుమ్మడి), రవి (కృష్ణ), కాసులయ్య (అల్లు రామలింగయ్య), చందారావు (రావు గోపాలరావు), మరికొందరు గ్రామపెద్దలు కూర్చొని ఉన్నారు

"చిన్న బావి దగ్గర నీళ్ళకోసం జరిగిన గొడవ మీకు తెలుసు," అన్నాడు ధర్మారావు

"అది గొడవ కాదండీ, అమృతం కోసం రాక్షసులు, దేవతలు తన్నుకున్నంత యుద్ధం," అన్నాడు చందారావు

"మరిలాగే కొంత కాలం గడిస్తే, మంచినీళ్ళకు ప్రాణాలు కూడా తీసుకోవచ్చు కనుక వరుణదేవుడికి వేడుకలు జరిపిస్తే, వర్షాలు పడతాయని మన పెద్దల నమ్మకం," అంటూ ధర్మారావు అందరి వంక చూశాడు

రవి లేచి, "అయితే, ఎకరానికి పది రూపాయల చొప్పున వేసుకుని వైభవంగా జరిపిద్దాం," అన్నాడు



చందారావు ఆముదం తాగినవాడిలా ముఖం పెట్టి, "బాబూ! నాకు చందాలు తీసుకోవడం తప్ప ఇచ్చే అలవాటు లేదని మీకు తెలుసు. పైగా, రాజకీయ బాధితుడిగా నాకిచ్చిన పొలానికి ప్రభుత్వం వారే శిస్తు రద్దు చేశారు. కనుక, చందా విషయంలో కూడా నన్ను మినహాయించాలి," అన్నాడు.

కాసులయ్య కాకా పట్టి కార్యం సాధించే ఘనుడు. అంచేత, నక్క వినయంతో "అయ్యా, దేవుడిలాంటి ప్రెసిడెంటు ధర్మారావుగార్ని ఎదురుగా పెట్టుకుని మనం చందా ఎత్తడం — వారి మంచితనాన్ని, మర్యాదను, పైగా పెద్దరికాన్ని అవమానించినట్టవుతుంది. ఆ దానకర్ణులకు ఈ జాతర ఖర్చంతా భరించటం ఒక లెక్కా? ఏమంటారు, ధర్మారావుగారూ?" అన్నాడు.

ఆ యుక్తిని గుర్తించలేని ధర్మారావు "నాకంతకంటే తృప్తేముందయ్యా? ఖర్చంతా నేనే భరిస్తాను," అన్నాడు.

అందరూ చప్పట్లు కొట్టారు.

పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో విడుదలకు సిద్ధమవుతూన్న "బంగారు భూమి" చిత్రానికి ఎస్. పి. వెంకన్నబాబు నిర్మాత.

## ప్రశాంతి క్రియేషన్స్ తొలి చిత్రం

కె. విశ్వనాథ్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వి. వి. శాస్త్రి నిర్మించే తొలిచిత్రం షూటింగ్ డిసెంబర్ 13 నుండి విశాఖపట్నం, అరకులోయ

కథ-స్క్రీన్‌ప్లే-మాటలు
**దాసరి నారాయణరావు**

దర్శకత్వం:
**బి.వి.ప్రసాద్**

ర శ్రీ వి ఫి లిం స్

# నాయుడుగారబ్బాయి

నిర్మాతలు: N. రామలింగేశ్వరరావు, B.V.P.A. గోపీనాథ్

నైజాం: శ్రీలక్ష్మి పిక్చర్స్   సీడెడ్: స్వర్ణయుగ మూవీస్



# సినిమా

ప్రాంతాలలో చిత్రీకరణ జరుగుతోంది ఈ చిత్రం గురించి ఈ చిత్రాన్ని సమర్పించే అల్లు అరవింద్ ముచ్చటిస్తూ, "నేటి యువతీ యువకులు ఎదుర్కొంటున్న బర్నింగ్ ప్రాబ్లమ్స్‌కు పరిష్కార మార్గం చూపే ఇతివృత్తం కొన్ని సన్నివేశాలు హృదయాలను కదిలించివేస్తాయి మరికొన్ని సన్నివేశాలు కడుపుబ్బ నవ్విస్తాయి కొన్ని ఆలోచింప చేస్తాయి అందరికీ పూర్ణ సంతృప్తిని, పూర్ణానందాన్ని కలిగించే చిత్రం విశ్వనాథ్ గారి సహజమైన సున్నిత హాస్యధోరణిలో చిత్రం నడుస్తుంది సంగీత నృత్యభరిత చిత్రం కాకపోయినా వీటూరి, వేటూరి, అన్నమాచార్య కీర్తనలు — మొత్తం ఎనిమిదింటికి



'వంశగౌరవం'లో సుజాత, విజయశాంతి, గీత

కె వి మహదేవన్ అతిమధురమైన బాణీలు కూర్చారు విశ్వనాథ్ గారి చిత్రాలలోలాగే ఈ చిత్రంలో కూడా ప్రతి ఫ్రేమ్‌లో ఆయన ప్రతిభ కనిపిస్తుంది జనవరి నెలలో జరిగే రెండవ షెడ్యూల్‌తో చిత్రం పూర్తవుతుంది," అని వివరించారు. విశ్వనాథ్ దర్శకత్వంలో చిరంజీవి తొలిసారిగా నటించే ఈ చిత్రంలో సుమలత, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, రాళ్ళపల్లి, కుమారి (బేబీ) తులసి ఆదిగాగల వారుంటారు గొల్లపూడి సంభాషణలు, లోక్‌సింగ్ ఛాయ, తోట శిల్పం, జి జి కృష్ణారావు కూర్పు తెరవెనుక హంగులు ★

మీ వ్యాపార ప్రారంభానికి పెట్టుబడి కావాలా?
మీ వ్యాపారాభివృద్ధికై
పెట్టుబడి పెంచాలా?
పాడిన వెంటనే డబ్బు సర్దుబాటు
చేయగల ఏకైక సంస్థ!

# మీ వీలును బట్టి
# మీ రాబడిని బట్టి
# నెలనెలా కుదువబెట్టి
# అధిక మొత్తం
# రాబట్టండి!

స్వల్పకాల చీట్లు

| గ్రూపు పేరు | చీటి మొత్తం విలువ | వాయిదాలు | సభ్యులు | నెలసరి వాయిదాలు | పాట పరిమితి 5/కంపెనీ కమీషన్‌తో సహా |
|---|---|---|---|---|---|
| RCD | 25,000 | 25 | 25 | 1,000 | 30/ |
| RCF | 10,000 | 25 | 25 | 400 | 30/ |
| RCG | 5,000 | 25 | 25 | 200 | 30/ |

సంప్రదించండి.




## రావు చిట్ ఫండ్ కంపెనీ

పెద్దిభొట్ల వారి వీధి, గవర్నరు పేట, విజయవాడ-520002 PHONE 72287

DIMPLE da



సీరియల్

# జీవితవనంలో కొత్తగాలి

కుందుర్తి ఇందిరాదేవి

## 20

(గత సంచిక తరువాయి)

మర్నాడు --

నేను ఆఫీసుకి వెళ్ళటానికి తయారవుతున్నాను అమ్మ వచ్చింది నేను తలెత్తికూడా చూడలేదు జడ అల్లుకుంటూ ఉన్నాను

"సంధ్యా!"

"ఊఁ"

మనం ఎలాగూ కట్నకానుకలు ఇవ్వలేదు కనీసం దానికి చీరెలు, అబ్బాయికి బట్టలు, కాస్త చెంబూ గిన్నె ఇవ్వకపోతే ఏం బాగుంటుంది

నేను జడ వెనక్కి వేసుకుంటూ "నా దగ్గర డబ్బు లేదమ్మా" అన్నాను

"సంధ్యా!"

"అవునమ్మా మన పరిస్థితి ఏమిటో నీకు తెలుసుగా?" అన్నాను

"కానీ ఆడపిల్ల పెళ్ళిచేసి ఒట్టిచేతులతో ఎలా పంపుతామే" అంది అమ్మ

"బాగుందమ్మా, ఇదేమన్నా మన అందరి సమ్మతితో జరిగిందా? ఆమాత్రం శశికి తెలుసునే" అన్నాను పౌడర్ రాసుకుంటూ

"కానీ వాళ్ళ అత్తగారు ఊరుకుంటుందా?" అమ్మ అంది కోపంగా

"వాళ్ళు అన్నింటికి సిద్ధపడే పెళ్ళి చేసుకున్నారు కదమ్మా!"

"కానీ! ఇది తరతరాలుగా వస్తున్న ఆచారాలు సంధ్యా" అసహనంగా అంది అమ్మ నేను ఫక్కున నవ్వి బొట్టు పెట్టుకుంటూ అన్నాను -

"అందుకేనమ్మా అంటున్నాను ఏదైనా ఆచారాల ప్రకారం జరిగితే వాటికి ప్రాముఖ్యం ఇవ్వాలమ్మా వాళ్ళిద్దరికీ ఇష్టమైంది చేసుకున్నారు మధ్యలో అత్తగారి గోల మనకెందుకు?" నిర్లక్ష్యంగా అన్నాను

"సంధ్యా! మీ నాన్నే బ్రతికుంటే ఇలా చేసేవారా?" అమ్మ మండిపడింది

"అమ్మా!" నేను చివ్వున తిరిగాను

"అవునే కన్నకూతురు అత్తగారింటికి వెళ్తే కనీసం జాకెట్టుముక్కయినా పెట్టలేదంటే ఇంతకన్నా అవమానం ఇంకోటుందా? లోకులంతా నన్నాడిపోసుకోరు" అమ్మ ఆగ్రహంగా అంది

"అక్కకి పెళ్ళి కాకుండా, చెల్లెలు చేసుకుంటే లోకులు ఆడిపోసుకోరా అమ్మా!" అనబోయి బలవంతాన ఆపుకున్నాను

"ఇప్పుడు అంత డబ్బు నేనెక్కడ తేగలనమ్మా ప్రమీల కూడా లేదు ఉన్న అప్పులే తీరక ఛస్తుంటేను అయినా అది ఉద్యోగం సద్యోగం లేకుండా ఎందుకు పెళ్ళి చేసుకోవాలి? ఎలా బ్రతకాలని?" నేను చాలా విసురుగానే అన్నాను

"ఆ అబ్బాయి మన శశిని కావాలని ఏరికోరి చేసుకున్నాడు ఆ పిల్లాడు ఎంత బుద్ధిమంతుడు ఉద్యోగం ఏముంది, ఇవ్వాళ కాకపోతే రేపు వస్తుంది" అంది తేలిగ్గా

నేను ఛర్రుమన్నాను "ఆఁ అక్కడ ఉద్యోగాలు ఏమీ కుప్పలు పోసుక్కూర్చోలేదు నాకు తెలీదు నాకు అప్పు ఇచ్చేవాళ్ళు ఈ భూమండలంలో ప్రమీల తప్ప ఎవ్వరూ లేరు" ఖచ్చితంగా అన్నాను

"భగవంతుడా! ఇంత మొండిపిల్లని పుట్టించావేమిటా తండ్రీ" అమ్మ ఏడవసాగింది

నేను వెర్రిదానిలా చూశాను మరుక్షణం చివ్వున ఇంట్లోంచి వచ్చేశాను ఎలా వచ్చానో ఎలా బస్సెక్కానోకూడా గుర్తులేదు ఆ రోజు ఆఫీసులో అసలు పని చేయలేకపోయాను అమ్మమీద కోపంతో ఉదయం, శశిమీద కోపంతో రాత్రిపూట భోజనం చేయకపోవటంమూలాన కళ్ళు తిరుగుతున్నాయి.

కిరణ్ మద్రాస్‌నుంచి వచ్చేసేవుంటాడు నేను మధ్యాహ్నం సెలవుపెట్టి కిరణ్ ఆఫీసుకి వెళ్ళాను ఆ సమయంలో కిరణ్ ఎవరితోనో మాట్లాడుతున్నాడట ప్యూన్ నన్ను అక్కడున్న బెంచీమీద కూర్చోమన్నాడు మధ్యలో ఇంకెవరో వెళ్ళారు అరగంట గడిచింది మధ్యలో ప్యూన్‌ని బ్రతిమాలి ఏంచేస్తున్నాడో చూసిరమ్మన్నాను

అతను గోడకి కొట్టిన బంతిలా తిరిగొచ్చి "అమ్మో! అయ్యగారు అసలే చిరాగ్గా ఉన్నారు ఫోన్‌లో ఎవర్నో తిడుతున్నారు ఇంకాసేపు కూర్చోండమ్మా" అన్నాడు

నా ఒళ్ళు వేడిగా ఉన్నట్టుంది కళ్ళు తిరుగుతున్నాయి అక్కడ పనిచేస్తున్నవాళ్ళ దగ్గరికి వెళ్ళి అక్కడున్న హెడ్‌గుమాస్తాని "మీ బాస్‌తో కొంచెం పని ఉంది సర్! ఎలా కలుసుకోవాలి?" అన్నాను

అతను నావైపు ఎగాదిగా చూసి బట్టతల సర్దుకుంటూ "ఎవరు కిరణ్‌గారితోనా?" అన్నాడు నేను అవునన్నాను అతను నాకో స్టూల్ ఆఫర్‌చేసి "అయితే అలా కూర్చోండి బాస్ ఎవరితోనో మాట్లాడుతున్నారు" అన్నాడు

ఇంకో పావుగంట గడిచిపోయింది నాకు టెంపరేచర్ పెరుగుతున్నట్లుగా ఉంది చప్పున ముందుకు వంగి టేబుల్‌మీద తల ఆన్చుకుని మోచేతిని అడ్డుపెట్టుకున్నాను ఆఫీసులో అప్పటికే అందరూ నన్ను వింతగా చూస్తూ చెవులు కొరుక్కుంటున్నారు

"ఏమ్మా! బాస్‌తో మీకేం పని ఏదైనా ఉద్యోగం కోసమా? ఆయనసలే ఈ రోజు చాలా కోపంగా ఉన్నారు" హెడ్‌గుమాస్తా అన్నాడు

నేను నీరసంగా తలెత్తి "చిన్న కాగితం ఇస్తారా?" అన్నాను అతను తీసిచ్చాడు "ప్యూన్‌ని పిలుస్తారా?" అన్నాను అతను పిలిచాడు

నేను పేపర్ తీసుకుని దానిమీద 'మిసెస్ సంధ్యా కిరణ్' అని వ్రాసి ప్యూన్ చేతికిచ్చి "ఏమంటారో వచ్చి నాకు చెప్పు" అన్నాను నేను మళ్ళీ అలా పడుకుండిపోయాను

---

**జరిగిన కథ - 10:** పోతూ పోతూ ఆ కుటుంబ భారంతోపాటు చేసిన అప్పు కూడా పెద్దకూతురైన సంధ్యపై వేసి కన్నుమూస్తాడు ఆమె తండ్రి ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితో పాటుగా తమ్ముణ్ణి, ముగ్గురు చెల్లెళ్లను పోషిస్తూ వాళ్లకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది ఎప్పుడైనా డబ్బు అవసరమైతే తన స్నేహితురాలు ప్రమీల దగ్గర తెచ్చుకుని మళ్లీ ఇచ్చేస్తుంటుంది ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుళ్లు తొడుగుతూంటుంది ప్రమీల పుట్టినరోజు పార్టీకి సంధ్యా, కిరణ్‌లు వెళతారు, ఆమె ఆహ్వానించగా పార్టీ పూర్తయిన తర్వాత తన స్కూటర్‌పై సంధ్యను వాళ్లింటి దగ్గర దించి వెళతాడు కిరణ్ సంధ్యకు దగ్గర కావాలనే ఉద్దేశ్యంతో కిరణ్ చేసే పనులు ఆమెకు ఆశ్చర్యాన్ని కల్గిస్తాయ్! శశి ఎవరో అబ్బాయితో తిరుగుతుండగా చూసిన ప్రమీల చెప్పేగాని తన కర్తవ్యం ఏమిటో గుర్తుకు రాలేదు సంధ్యకి శశి ఎవరితోనో తిరగడం తన కళ్లారా చూసిన సంధ్య నిశ్చేష్టురాలవుతుంది ఒకరోజు "సంధ్యా ఐ లైక్ యూ! ఐ లౌ యూ" అని కిరణ్ చెప్పగా ఆమె ఉబ్బితబ్బిబ్బవుతుంది శశి చదువు పూర్తయి ఉద్యోగంలో చేరగానే ఆమెకు ఆ ఇంటి బాధ్యత అప్పగించి సంధ్యా, కిరణ్‌లు పెళ్లి చేసుకొని తామూ సహాయపడాలని నిశ్చయించుకొంటారు తమ అన్నమాటలకు శశి తన ప్రియుడు ప్రకాష్‌తో నిక్కచ్చిగా మాట్లాడి వెళ్లిపోవడం చూసిన సంధ్య ఆశ్చర్యపోతుంది. ఆమె అభిమానానికి సంధ్యకు పుట్టినరోజు కానుకగా 'జీవితవనం' అనే ఛాయాచిత్రాన్ని గీసి ఇస్తాడు కిరణ్ ఉద్యోగంలో చేరి ఆ ఇంటికి ఆధారం అవుతుందనుకొన్న శశి, ప్రకాష్‌ని పెళ్లి చేసుకొని వెళ్ళిపోవడంతో, దిక్కు తోచని పక్షిలా విలవిలలాడిపోతుంది సంధ్య.

---

"ఏమ్మా! జ్వరంగా ఉందా?" అతను ఆరాగా అడిగాడు. నేను అవునన్నట్టు తలూపాను. రెండు నిముషాల తర్వాత టకటకా ఎవరో పరిగెత్తుకొస్తున్నట్టు బూట్ల చప్పుడు. నేను బలవంతంగా కళ్ళెత్తి చూశాను. కిరణ్ టకటకా పరిగెత్తుకొస్తూ "సంధ్యా" అన్నాడు. గుమస్తాలంతా నిలబడి వింతగా చూస్తున్నారు.

"సంధ్యా! మై గాడ్ ఎప్పుడు వచ్చావు. ఇక్కడ కూర్చున్నావేం?" అన్నాడు గబగబా. నేను తలెత్తి నవ్వబోయాను.

అతను నా భుజంచుట్టూ చెయ్యివేసి "లే! ఇక్కడ కూర్చున్నావేం? అలా ఉన్నావేం? మై గాడ్! ఒళ్ళు వేడిగా ఉందేమిటి? జ్వరం వచ్చిందా?" ఖంగారుగా అన్నాడు.

హెడ్‌గుమస్తా నిటారుగా నిలబడి "సార్! పాపం వచ్చి గంటవుతోంది సార్" అన్నాడు వినయంగా.

నేను లేచి నిలబడ్డాను. అతను ఎడంచెయ్యి నా భుజంచుట్టూ వేసి "నీకసలు బుద్ధి ఉందా? ఇంత జ్వరంతో ఉండి ఎందుకు వచ్చావు? పైగా గంటసేపటినుండి పడిగాపులు గాస్తున్నావా? నేనేదో పనితొందరలో ఉండి వెయిట్ చెయ్యమన్నాను" అని నన్ను చివాట్లుపెడుతూ "రంగయ్యా" అని బిగ్గరగా పిలిచాడు.

రంగయ్య పరిగెత్తుకొచ్చాడు. కిరణ్ నన్ను అక్కడే ఒక కుర్చీలో కూర్చోబెట్టి జేబులోంచి డైరీ తీసి ఒక పేపర్ చించి గబగబా వ్రాసి "చూడు! సరిగ్గా అయిదు నిముషాల్లో ఈ టాబ్లెట్లు, రెండు కప్పుల కాఫీ తీసుకురా పరిగెత్తు" అంటూ జేబులో డబ్బుతీసి రంగయ్యకిచ్చి పరిగెత్తించాడు.

నేను చిరుకోపంగా అన్నాను — "ఏయ్ కిరణ్! నువ్వు ఎంత ఆఫీసర్‌వి అయినా, వచ్చిన వాళ్ళని గంటల తరబడి బయట కూర్చోబెట్టటం చాలా అన్యాయం సుమా" అన్నాను.

కిరణ్ నా ముక్కుపట్టి ఊపుతూ "నా ఖర్మ కాలి మా ఆఫీసర్ ఇప్పుడే వచ్చాడు. ఏంచేసేది లేడవగలవా ఎత్తుకెళ్ళమంటావా" అంటూ తన మామూలు ధోరణిలో హాస్యం చేశాడు.

"అమ్మో! వద్దు! వద్దు" అన్నాను.

కిరణ్ తన గదిలోకి తీసుకువెళ్ళి కుర్చీలో కూర్చోపెట్టాడు. ఒక స్టూల్ లాగి నా కాళ్ళు దానిమీద పెడేశాడు.

"ప్రస్తుతానికి ఇదే నీ బెడ్ అనుకో" అన్నాడు.

"ఓ కే! సర్" నేను అంగీకరించాను.

"ఏమిటి విశేషాలు! ఇంతవరకూ ఫోన్ చెయ్యాలనుకుంటూనే పడలేదు" అన్నాడు.

నా మొహంలో విషాదరేఖలు తారట్లాడాయి.

"చాలా పెద్ద విశేషం కిరణ్" అన్నాను.

"ఐ సీ! నేను కూడా ఒక విశేషం చెబుతాను" నవ్వుతూ అన్నాడు.

"ఏమిటది" ఆత్రంగా అన్నాను.

"ఊహూ! ముందు నువ్వే చెప్పు" అన్నాడు.

"శశి నిన్న గుళ్ళో వివాహం చేసుకుంది" ఎలాగో అన్నాను.

"వ్వాట్" కిరణ్ రివాల్వింగ్ ఛెయిర్‌లో గిర్రున తిరిగాడు.

"అవును" భారంగా అన్నాను. అతను నిశ్చేష్టుడైన వాడిలా చూస్తున్నాడు. నేను హఠాత్తుగా మోకాళ్ళలో తల ఆనించుకుని ఏడ్చేశాను. అంతా నిశ్శబ్దం అయిపోయింది కాసేపు.

అతను నా తలమీద చెయ్యివేస్తూ "సంధ్యా" అన్నాడు. ఆ కంఠంలో ఏ మాత్రం ఉత్సాహంలేదు.

నేను వెక్కి వెక్కి ఏడుస్తున్నాను. శశి పెళ్ళి చేసుకున్న వైనం అంతా చెప్పేశాను.

"మీ చెల్లి అసలు ఉద్యోగం చేస్తుందా" అతని మొహం ఆదోరకంగా ఉంది.

"అది ఉద్యోగం చేస్తుంది" అన్నాను వెక్కుతూనే.

అతను నిట్టూర్చాడు. తర్వాత నవ్వుతూ 'చెల్లి పెళ్ళి చేసుకుంటే ఆనందంగా ఉండాల్సింది పోయి ఆ ఏడుపు మొహం ఏమిటి' అన్నాడు నా కళ్ళు తుడుస్తూ. నేను కర్చీఫ్‌తో కళ్ళు తుడిచేసుకున్నాను.

ప్యూన్ మందులు, కాఫీ తెచ్చాడు. నాకు మందులంటేనే తగనిభయం. కిరణ్ నాచేత బలవంతంగా మింగించాడు. తర్వాత ఫైల్స్ చకచకా సర్దేసి "రా వెడదాం" అన్నాడు. అతను కాషియర్






దగ్గరకెళ్ళి ఏదోచెప్పి డబ్బులు తీసుకుని సంతకం పెట్టి వచ్చాడు నన్ను డాక్టర్‌కి చూపించి — "జాగ్రత్తగా టాబ్లెట్లు మింగు లేకపోతే రేపు ఉదయాన్నే పరిగెత్తుకొస్తాను" అని బెదిరించి "నా కోసం సంధ్యా" అని బ్రతిమాలి నన్ను ఇంటి దగ్గర దింపేశాడు

"లోపలికి రా" ఏ మాత్రం సంకోచంలేకుండా అన్నాను

"ఊహూ! తర్వాత ఎప్పుడైనా వస్తాను" అన్నాడు

నేను హఠాత్తుగా గుర్తువచ్చిన దానిలా "ఏయ్ కిరణ్! నువ్వు ఏదో విశేషం చెబుతాను అన్నావు ఏమిటది" అన్నాను

అతని మొహంలో క్షణంపాటు ఆశాభంగం అనేది మెరుపులా మెరిసి మాయమైంది

"ఏంలేదు! నిన్ను ఊరికే ఏడిపిద్దామని" సరదాగా అన్నట్టుగా నవ్వాడు అతను చప్పున చెయ్యి చాచి నోట్లు కొన్ని నా బ్యాగ్ అందుకొని అందులో పెట్టి మూసేశాడు

"ఏయ్! ఏమిటా పని" ఖంగారుగా అన్నాను

"ఛట్! నువ్వు మాట్లాడకు మీ చెల్లెలికి, మా తమ్ముడికి ఏమైనా కొనిపెట్టు" అన్నాడు సరదాగ

"అయితే ఇంత డబ్బా" అని తియ్యబోయాను

అతను చప్పున నా చెయ్యి పట్టి ఆపేసి "ఇది ఈ ఇంటి పెద్దల్లుడు ఇస్తున్నాడు కాదనే అధికారం నీకు లేదు" అన్నాడు

నేను నిరుత్తరురాలిలా చూస్తూ "అచ్ఛా" అన్నాను

అతను నా చెంపపై చిటికె వేసి "మై డియర్ కంట్రీ ఫ్లవర్ డోంట్ థింక్ అదర్‌వైస్ నాకు మాత్రం హక్కుంది ఏం బెంగపడకు హాయిగా తియ్యటి కలలు కంటూ నిద్రపో" అని చిలిపిగా చూసి వెళ్ళిపోయాడు అమ్మ ఉదయం డబ్బు గురించి దెబ్బలాడటం గుర్తువచ్చి అది అమ్మకిచ్చేశాను

## 21

కిరణ్‌కి బొంబాయి ట్రాన్స్‌ఫర్ అయింది. అసలే శశి వివాహం చేసుకుంది, నా గతేమిటిరా భగవంతుడా అని దిగులుతో వున్న నాకు కిరణ్ ట్రాన్స్‌ఫర్ అశనిపాతంలా తగిలింది

## జీవితవనంలో కొత్తగాలి

"నేనేం చెయ్యను సంధ్యా! ఆ రోజు నాకు ప్రమోషన్ ఇచ్చి బొంబాయి ట్రాన్స్‌ఫర్ వేశారంటే ఎంత ఆనందపడ్డానో! నీకు చెబుదామని అనుకుంటుండంగానే శశి వివాహం చేసుకుంది, అని ఏడుస్తూ కూర్చున్నావు అందుకే చెప్పలేకపోయాను ఈ వెధవ ప్రమోషన్ రాకపోయినా బాగుండేది నేను జాయిన్ అయితీరాలి ఎలా సంధ్యా?" అతను విచారంగా అంటుంటే నాకు పిచ్చెక్కిపోయింది

"కిరణ్" అంటూ బావురుమన్నాను

"ప్లీజ్ సంధ్యా! నాకసలే ఎలాగో ఉంది నువ్వు పూర్తిగా నా మతి పోగొట్టకు" అతను నన్ను తన ఒళ్ళోకి లాక్కుంటూ అన్నాడు

"కిరణ్! నేనేం చెయ్యాలి? ఏంచెయ్యాలి?" ఏడ్చేస్తున్నాను

"ఛట్! ఏమిటీ పిరికితనం? శశికి వారం పది రోజుల్లో అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ వస్తుంది నువ్వు ఉద్యోగానికి రాజీనామ చేసెయ్యి మనం బొంబాయి వెళ్ళిపోదాం అంతగా అవసరమనుకుంటే అక్కడే ఏదైనా ఉద్యోగం దొరక్కపోదు" అన్నాడు

"కిరణ్" నేను సంభ్రమంగా అన్నాను

"అవునోయ్ సంధ్యారాణీ! నీకసలు బుర్రలేదు ప్రతిదాన్నీ విపరీతంగానే ఆలోచిస్తావు" అన్నాడు నా ముక్కుపట్టి ఊపుతూ

కిరణ్ వెళ్ళిపోయే రోజు నేను ఎంతగానో ఏడ్చాను

"యూ సిల్లీ గర్ల్! రోజూ ఉత్తరాలు వ్రాస్తుంటాగా వారానికోసారి ట్రంక్ కాల్ చేస్తాగా ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు రెక్కలు గట్టుకుని వాలనుటోయ్" అన్నాను నవ్వుతూ

"నాకు ఎలా తోస్తుంది నాకెందుకో భయం వేస్తోంది కిరణ్"

"అదిగో! అదే వద్దన్నాను హరిహరాదులు అడ్డొచ్చినా మనం పెళ్ళి చేసుకునేది ఖాయం ప్లీజ్ సంధ్యా నువ్వు అలా ఏడుస్తూ కూర్చున్నావంటే నేనసలు బొంబాయి వెళ్ళనేవెళ్ళను" అన్నాడు బాధగా

నేను గుటుక్కున ఏడుపు మింగేశాను కిరణ్ వెళ్ళి ప్లేన్ ఎక్కాడు ఆఖరిసారిగా చూస్తున్నట్టు అపురూపంగా చూస్తూ లోపలికి వెళ్ళిపోయాడు నేను దిగులుగా నిలబడిపోయాను చూస్తుండగానే ప్లేన్ ఆకాశంలో రివ్వున దూసుకుపోతూ మబ్బుల్లో కలిసిపోయింది నాలో ఉన్న పంచప్రాణాలు కిరణ్‌తోటే వెళ్ళిపోయినట్టుగా అనిపించసాగింది

నేను ఒంటరిగా కాళ్ళు ఈడ్చుకుంటూ ఇంటికి వచ్చేశాను కిరణ్ అన్నట్టుగానే వారం తిరిగేసరికి శశికి అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ వచ్చింది నేను ఆనందంతో గంతులు వేస్తున్నట్టుగా ఇంటికి వచ్చాను

వస్తూనే "అమ్మా! లమ్మా" అని గావుకేకలు వేశాను ఇంట్లో అందరూ పరిగెత్తుకొచ్చారు

"శశికి ఉద్యోగం వచ్చిందోచ్" అని గట్టిగ అరిచేశాను అమ్మ నవ్వుతూ చూసింది

"ఒరేయ్ ఫల్గుణా నువ్వు వెళ్ళి రేపు శశిని పిలుచుకురా" అని ఆర్డర్ జారీచేసి "లలలా" అని రాగంతీస్తూ గదిలోకి వెళ్ళిపోయాను తియ్యని కలలుకంటూ నిద్రపోయాను

మర్నాడు ఆఫీసులో నన్ను చూసి

"ఏమిటండీ సంధ్యారాణిగారు! భలే హుషారుగా ఉన్నారు" అని అడిగారు

"మా చెల్లికి ఉద్యోగం వచ్చింది" అన్నాను నవ్వుతూ

"మా సంధ్యారాణి పెళ్ళికూతురాయెనే" అని విమల రాగం తీసింది నేను సిగ్గుపడిపోయాను

"సంధ్యారాణిగారు త్వరలో గ్రాండ్‌గా డిన్నర్ ఇస్తారన్నమాట" అన్నాడు హనుమంతరావు నవ్వుతూ సాయంత్రం ఇంటికి వచ్చాను ఇంట్లో వాతావరణం ఏమిటో డల్‌గా ఉంది

నేను శశిని చూసి "హార్టీ కంగ్రాట్యులేషన్స్ శశీ నీకు ఉద్యోగం వచ్చింది" అన్నాను ఆనందంగా చెయ్యి చాస్తూ

శశి నా చేతిని అందుకోలేదు "ఊ" అని ఊరుకుంది

"ఏయ్ శశీ ఇలా రా" అని నా గదిలోకి వెళ్ళిపోయాను శశి మౌనంగా వచ్చింది నేను హుషారుగా అన్నాను —

"ఎలా ఉందే శశీ! నీ కొత్త సంసారం"

శశి చిన్నగా నవ్వింది

"ఉద్యోగం లేకుండా పెళ్ళి చేసుకున్నావని బాధపడ్డాను నీకు ఇంత తొందరలో ఉద్యోగం వస్తుందని అనుకోలేదు యు ఆర్ లక్కీ!" అన్నాను

# నాణ్యత కొండెత్తు...వెల వీసమెత్తు.



అముల్‌వారి న్యూట్రముల్ అదే, శ్రేష్ఠతకు హామీ. పరిపుష్టమైన కోకో, హితకరమైన అముల్ పాలు ప్రశస్తమైన మాల్టు అతి ముఖ్యమైన విటమిన్లు, ఖనిజాలు. మరి సాటిలేని ఆ శక్తికారక లక్షణాలు.
ఇవన్నీ మీకు మిగత వాటికన్న ఇంచుమించు 4 రూపాయలు తక్కువ వెలకు.
న్యూట్రముల్ వస్తాదుగా అవండి.
ఆ తేడా ఆనందించండి.

మిగతవాటికన్న ఇంచుమించు 4 రూ చవక!

ఇటువంటి ఆహార పానీయాల ధరల పోలిక (రూ.)*
నాన్ ఫ్లెక్సిబుల్ ప్యాకేజింగ్

| | 500 గ్రాం. | 800 గ్రాం. | 1000 గ్రాం. |
|---|---|---|---|
| న్యూట్రముల్ డబ్బా | 13.83 | – | 26.67 |
| మాల్టోవా సీసా | 17.58 | – | – |
| బోర్నవిటా డబ్బా | 17.68 | 26.97 | – |
| బూస్ట్ సీసా | 18.87 | – | – |

*మార్చి '81లో కొనుగోలుదారుల గరిష్ఠ ధర. స్థానిక పన్నులు అదనం.

IS 1806














మార్కెట్ చేసేవారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్ 388 001

daCunha/81/GCM/53/TL







శశి తలెత్తి ఏదో అనబోయి మళ్ళీ ఆగిపోయింది నేను నవ్వుతూ అన్నాను —

"నాకు నీ మీద కోపం ఏంలేదు శశీ! నువ్వు ఆరోజు పబ్లిక్ గార్డెన్స్‌లో ప్రకాష్‌తో అన్నమాటలు విన్నాను నువ్వు చెప్పా చెయ్యకుండా పెళ్ళి చేసుకుంటే నాకు మరి ఎలా ఉంటుంది చెప్పు? నేనూ వివాహం చేసుకుందామనుకుంటున్నాను కిరణ్‌కి ట్రాన్స్‌ఫర్ అయి బొంబాయి వెళ్ళిపోయాడు తెలుసుగా! మనిద్దరం వివాహం చేసుకున్నా ఈ ఇంటికి సహాయంగా నిలబడితే నాన్నగారి కోరిక తీర్చిన వారం అవుతాము అసలు కిరణ్ ఈ ఉద్యోగం రావటానికి ఎంత ప్రయత్నం చేశాడని! నా జీతం అంతా అమ్మకే ఇచ్చేస్తాను ప్రకాష్‌కి ఉద్యోగం లేదుగా నువ్వు కొంత ఉంచుకుని మిగిలిందే అమ్మకివ్వు ప్రకాష్‌కి కూడా మంచి ఉద్యోగం చూడమంటాను కిరణ్‌ని"

నేను నా ధోరణిలో హుషారుగా చెప్పేస్తూ చప్పున ఆగిపోయాను శశి అసలు ఇంత వరకూ ఒక్కమాటయినా మాట్లాడలేదు తల వంచుకుని చీరకొంగు వేలికి చుట్టుకుంటోంది

"పోనీలే శశీ! నేనేం అనుకోనులే నేనూ పెళ్ళి చేసుకుంటున్నానుగా నువ్వు సిగ్గుపడటం ఎందుకు ఏమిటి?" శశి గడ్డంపట్టి ఎత్తి నిశ్చేష్టురాలినైపోయాను శశి మునిపంటికింద పెదవిని నొక్కుతోంది కళ్ళల్లో నీళ్ళు నేను చూడగానే ఒక్కసారిగా బయటికి దూకాయి

"శశీ" నేను విభ్రాంతిగా అన్నాను.

అంతే! శశి ఒక్కసారిగా రెండుచేతుల్లోనూ మొహం దాచుకుని బావురుమంది "శశీ! వాట్ హాపెండ్! ఎందుకేడుస్తున్నావు" గాభరాగా అన్నాను శశి నా ఒళ్ళో తలదాచుకుంది ఏడుస్తున్నట్టు గుర్తుగా భుజాలు ఎగిరెగిరిపడుతున్నాయి

"ప్లీజ్ శశీ! ఏమైంది ఎందుకా ఏడుపు! నాకు భయంగా ఉందే శశీ! మీ అత్తగారేమైనా అన్నారా" ఒణికిపోతూ అన్నాను

"ఏం ఏం అనలేదు" అస్పష్టంగా అంది శశి

"మరి ఎందుకు ఏడుస్తున్నావమ్మా?"

# జీవితవనంలో కొత్తగాలి

"నేను నేను ఉద్యోగం చెయ్యటం మా అత్తగారికి ఇష్టంలేదు" శశి అస్పష్టంగా వెక్కిళ్ళ మధ్య అంది

అంతే! నా కాళ్ళక్రింద భూమి బద్దలై పోతున్నట్టనిపించింది శశి ఏడుస్తూ చెప్పిన ఆ మాటలు నాకు తుపాకీ గుళ్ళల్లా తగిలాయి

"ఏమిటే! ఏమిటి నువ్వంటున్నది శశీ! మళ్ళీ చెప్పు! మీ అత్తగారు నిన్ను ఉద్యోగం చెయ్యొద్దని ఆర్డరిచ్చిందా" శశి భుజాలుపట్టి ఊపుతూ పిచ్చెక్కిన దానిలా అరిచాను

శశి భయ విహ్వలంగా చూస్తూ "అవును" అంది చివరికి నేను నిశ్చేష్టురాలినైపోయాను అయితే శశి ఉద్యోగం చేయదా!

"మరి మరి మీరు ఎలా బ్రతుకుతారు" ఎలాగో అన్నాను

"మాకు ఇళ్ళద్దెలు వస్తాయక్కా! ప్రకాష్‌కి మెల్లగా ఏదో ఒక ఉద్యోగం రాకపోదు" శశి ఒణికిపోతూ అంది

"నువ్వు నువ్వు ఎందుకు చెయ్యవు"

"మా అత్తగారు ఇప్పటికే ఈ పెళ్ళి చేసుకుని శాఖ మంగలం చేశావురా అని చిటపటలాడుతోందక్కా" శశి కళ్ళల్లో అంతులేని జాలి, నిస్సహాయతా రాశి పోసినట్టున్నాయి

నేను హఠాత్తుగా ఏడ్చేస్తూ "శశీ! ఇది చాలా అన్యాయం శశీ! నేను మాత్రం నీలాంటి ఆడపిల్లను కాదా! ప్రకాష్ పెళ్ళికి ముందు నీతో అలా కబుర్లుచెప్పి, ఇప్పుడు పెళ్ళి అయ్యాక ఉద్యోగం చెయ్యటానికి వీల్లేదు అంటాడా నేను అతనికి చెబుతాను ఒప్పిస్తాను" అన్నాను? ఆ సమయంలో నాలో నేను అపురూపంగా దాచుకునే సిగ్గు, లజ్జ అన్నీ మర్చిపోయాను

శశి అడ్డంగా తల ఊపి "ఒప్పుకోరక్కా! మొగుడికి ఉద్యోగం లేకుండా, ఆడదానివి నువ్వు సంపాయించి నా కొడుకుని పోషిద్దామనుకున్నావా! చస్తే వీల్లేదు అన్నారక్కా మా అత్తగారు ప్రకాష్ కూడా వద్దని ఘల్లుణముందే అన్నాడక్కా"

అంది ఏం చెయ్యాలో తోచనిదానిలా చేతులు నలుపుకుంటోంది

నేను కళ్ళు తుడుచుకుంటూ రోషంగా అన్నాను — "ఎవరి సుఖాలు, ఆనందాలు వాళ్ళు చూసుకుంటుంటే మధ్యలో నాకు మాత్రం ఏం పట్టింది? నేనుకూడా నా దారి నేను చూసుకుంటాను ఇన్ని సంవత్సరాలు ఎలాగో నాకు చేతనయింది చేశాను ఇక నావల్ల కాదు"

"అక్కా" శశి చివ్వున చూసింది

ఇంతలో అమ్మ వచ్చి ఎప్పుడు నిలబడిందో నాకు తెలీదు

"శశీ" అని పిలిచింది మరుక్షణం శశి అమ్మ గుండెల్లో తలదాచుకుని గొల్లుమంది ఆ ఏడుపు వరదలా నన్ను ముంచేస్తూ, నాకు ఊపిరాడనీయక ఉక్కిరిబిక్కిరి చేస్తున్నట్టుగా ఉంది

"అమ్మా! నన్ను నువ్వెందుకు కన్నావమ్మా! నేను పొరపాటు చేశానమ్మా! నేను ఇక మా అత్తగారింటికి వెళ్ళనమ్మా, వెళ్ళను! నేను ఉద్యోగం చేసి ఈ ఇంటికి ఆధారంగా నిలబడతానమ్మా!" శశి బొంగురుపోయిన గొంతుతో అంటోంది

"అయ్యో నా తల్లీ! బంగారంలాగా అత్తింట కాపురం చేసుకోక ఈ గోలంతా నీకెందుకే?" అని శశి వీపు నిమురుతూ నావైపు తీక్షణంగా చూస్తూ అంది -

"సంధ్యా! నువ్వసలు మతి ఉండే మాట్లాడుతున్నావా?"

"అక్షరాలా! అంత ఒళ్ళు దగ్గరలేకుండా నేను ఎప్పుడూలేను అంత కానిపనులు, కాని మాటలు నేనేమీ అనలేదు" రోషంగా అన్నాను

"చూశావామ్మా! నేను కానిపనులు చేశానుట" అందుకుంది శశి

"నువ్వు ఊరుకోమ్మా" అంటూ —

"అయితే నీ దారి నువ్వు చూసుకుంటే ఈ కుటుంబం, పరువుప్రతిష్ఠ ఏంకావాలి?" మండిపడుతూ అంది

"గో టూ హెల్" నేను ఛర్రుమన్నాను

"ఒసేయ్ సంధ్యా! నీ దారి నువ్వు చూసుకుంటే నీ చెల్లెళ్ళని, తమ్ముడిని ఏంచేద్దామని ఇలాటి పనులు చేద్దామనేనా 'ఈ కుటుంబాన్ని నేను

# కర్నాటక
# రాష్ట్ర లాటరీ

గొప్ప
బహుమతి

# రూ. 20 లక్షలు

5 మొదటి బహుమతులు
**రూ. 1,00,000**

రూ. 38,90,000 విలువగల
1,96,471 నగదు బహుమతులు

## నూతన సంవత్సర
## బంపర్ డ్రా

**ప్రతి టిక్కెట్టు రూ. 3**

## 10-1-82

మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్.

KSL—212—TEL




### సి. ఎస్. ఆర్. - శ్రీ కాళహస్తి

నేను హైడ్రోసీల్ ఆపరేషన్ చేయించుకొని 20 రోజులు అయినది వాపు ఎన్ని రోజులకి తగ్గుతుంది? తీసుకోవలసిన జాగ్రత్తలు తెలపండి

★ హైడ్రోసీల్ ఆపరేషన్ చేసిన నెల రోజులకల్లా వాపు పూర్తిగా తగ్గిపోతుంది చాల జాగ్రత్తగా చేయబడిన ఆపరేషన్‌వల్ల ఇంకా త్వరగా తగ్గిపోవచ్చును

ఎక్కువగా నడవటం, ఎగరటం, సైకిల్ త్రొక్కటం మొదలయినవి చేయకూడదు

### పి ఆర్ ఆర్. - పశ్చిమ పల్లెం

నేను చాలా రోజులుగా ఈస్నోఫీలియాతో బాధపడుతున్నాను దానివలన నాకు పెద్ద ఎఫెక్ట్ లేకపోయినా నాకు ఏళ్ళ తరబడి కఫం వున్నది కఫం పూర్తిగా పోవటానికి ఏమైనా మందులు వున్నాయా?

★ ఇలా చాలా రోజులుగా కఫం ఉండి నెత్తురులో ఇయోసినోఫిల్స్ ఎక్కువగా ఉంటే అది అలర్జీని సూచిస్తుంది శరీరానికి పడని వస్తువులు వాడటంగాని, గాలిమార్పుగాని, కడుపులో క్రిములుగాని ఉండటం వల్ల ఈ అలర్జీ ఏర్పడవచ్చును

వరుసగా 2,3 సార్లు మలపరీక్ష చేయించుకొని, క్రిములు ఉన్నవని తేలితే తగిన చికిత్స చేయించుకోవలసి ఉంటుంది మిగతా కారణాలవల్ల అలర్జీ అని నిర్ధారణ అయితే వాటిని వాడటం మానాలి తాత్కాలికంగా యూనికార్బజాన్‌ఫోర్టి మాత్రలు రోజుకి రెండు చొప్పున వరుసగా నాలుగురోజులు వాడాలి

### ఎస్ ఆర్ - బ్రాహ్మణకోట్కూరు

మా పాప వయస్సు 7 సంవత్సరములు కూర్చోలేదు, నడవలేదు మాటలు రావు మల మూత్రములు వచ్చేదిగూడా తెలియదు వైద్యుడు లేదు డాక్టర్లు చూసి కొంచము వయస్సు వస్తేగాని రావచ్చని అన్నారు మీ సలహా ఏమిటి?

★ మీ పాపకు సెరిబ్రల్ పాల్సీ అనే రోగం ఉన్నది ప్రసవ సమయంలో జరిగిన ఆలస్యంవల్ల, లేక పుట్టిన తర్వాత శిశువు వెంటనే ఏడవకపోవటం వల్ల ఈ రోగం రాగల అవకాశం ఉన్నది ఈ రోగం వచ్చినవారికి కూర్చోటం, నడవటం మొదలైన శైశవ దశలన్నీ చాలా ఆలస్యంగా (అంటే కొన్ని సంవత్సరాలు) రావటం జరుగుతుంది కాలక్రమేణా పరిస్థితి కొంత మెరుగవుతుంది ఇవి తొందరగా రావాలని వాడే మందులేవీ లేవు

### సి. వి ఎల్. - హైదరాబాదు

నా వయస్సు 27 సంవత్సరములు గత 5 సంవత్సరముల నుండి నా చేతివేళ్ళు, ముంజేతులు, పాదములు ముడతలు పడి చాలా అసహ్యముగా వున్నవి వీటి నివారణకు ఏమైనా మార్గమువున్నదా?

★ ప్రతిరోజూ చర్మానికి ఆలివ్ ఆయిల్ పూసి ఒక గంటపాటు నాననిచ్చి తర్వాత నలుగు పెట్టి స్నానం చేయటం మంచిది

ఆహారంలో ప్రోటీనులు, క్రొవ్వు పదార్థాలు 2 : 1 అనే నిష్పత్తిలో వాడండి ★

---

నిలవెడతాను నాన్నా' అని ఆయనతో చెప్పావు ఈ వ్యాపారానికేనా?'' అమ్మ ఈసడిస్తున్నట్టుగా అంది

''అమ్మా!'' నేను బిగ్గరగా అరిచాను

అమ్మ నచ్చచెప్తున్నట్టుగా అంది 'నువ్వు న్యాయం చెప్పవే సంధ్యా! అత్తవారింట కాపురం చెయ్యాల్సిన పిల్ల మొగుడిని ఒదిలేసి ఉద్యోగం అంటూ పుట్టింట్లోఎలా ఉంటుంది చెప్పు'' అంది

''దాన్ని మొగుడితో కాపురం చెయ్యొద్దని చెప్పానా? అత్తారింట్లో ఉండొద్దని చెప్పానా? ఉద్యోగంచేసి ఈ ఇంటికి ఇంత సహాయం చెయ్యమన్నాను తప్పా?'' విసురుగా అన్నాను

''కానీ శశి ఉద్యోగం చెయ్యదు!'' అంది అమ్మ

''శశి ఉద్యోగం చెయ్యాలి! చేసి తీరాలి'' నేను అంతకన్నా బిగ్గరగా ఉన్నాను

శశి అమ్మ అండ చూసుకుని ''నేను చెయ్యనక్కా'' అంది

''శశీ'' నేను పిచ్చెక్కినదానిలా అరిచాను

''అవునక్కా! నేను నా కాపురాన్ని మూడు వాళ్ళ ముచ్చట చేసుకుందామని కాదు ఈ పెళ్ళి చేసుకుంది'' ముక్కు ఎగబీలుస్తూ అంది శశి

''శశీ! నువ్వు నా మాటకి ఎదురు చెప్తున్నావా'' నేను ఆకాశం తలక్రిందులవుతున్నట్టుగా చూశాను

''అలా అని ఎందుకనుకుంటున్నావు నా జీవితాన్ని నిలబెట్టుకోవాలని అన్నాను''

అమ్మ రయ్యిన అందుకుంది - ''ఎన్నడైనా అత్తింట కాపురం చేస్తే తెలుస్తుందే సంధ్యా!

## జీవితవనంలో కొత్తగాలి

శశి వాళ్ళత్తగారి మాటకి ఎదురుచెప్పదు దాని మొగుడికి కూడా ఇష్టం లేకుండా ఈ వెధవ ఉద్యోగం ఎలా చేస్తుంది''

నేను నోట మాట రానిదానిలా చూశాను ఈవిడ మా అమ్మ కాదు నన్ను ముద్దుమురిపాలతో పెంచి పెద్దచేసిన అమ్మ కానేకాదు ఈవిడలో ఇంత స్వార్థం ఎలా వచ్చింది? ప్రేమకి, మమతకి మారుపేరంటారే తల్లి! మరి అటువంటి అమ్మ నాకూ, శశికి ఇంత భేదం ఏమిటో స్పష్టంగా చెప్తోంది నిజమేనా? మైగాడ్! నాలో వణుకు లాంటిది వస్తోంది కళ్ళు రెపరెపలు కమ్ముతున్నట్టుగా ఉన్నాయి

శశి కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది

అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ ''సంధ్యా! నీకన్నా చిన్నపిల్ల తెలియక తప్పుచేస్తే మన్నించాలి అంతేగానీ దాన్ని సాధించకూడదమ్మా'' అని వెళ్ళిపోయింది

నేను తలుపులు బిద్దలయ్యేలా గడియేసి వచ్చి పడుకున్నాను నా నుదుటిమీద చెమటలు ధారలు కడుతున్నాయి శశి చిన్నపిల్లట! మరి అమ్మ ముందు నేనూ చిన్నపిల్లనేగా? నేను తొందరపడి ఏదైనా చేస్తే అమ్మ క్షమించవచ్చుగా మైగాడ్! మైగాడ్ నేను వణికిపోతున్నాను నా మాటకి ఒక్కసారయినా ఎదురుచెప్పని శశి ఎందుకు ఈరోజు అలా మాట్లాడింది? అందుకు సమాధానం నాకు చప్పున స్ఫురించింది

''అవును పచ్చినిజం! ఇంతకాలం శశికి నా అవసరం, నా అండదండలు అవసరం అయ్యాయి అందుకే నా సంపాదన తింటూ, నా రక్షణలో బ్రతికింది కాబట్టే అప్పుడు అణిగిమణిగి ఉండేది ఇప్పుడో! దానికి పెళ్ళయింది ఇప్పుడు మొగుడి రక్షణ, అత్తగారి అండదండలు కావాలి అవును'' ఈ పచ్చినిజం నేను మింగటానికి చాలా ప్రయత్నం చేస్తున్నాను ఇంతకాలం శశికి నేనంటే భయం అనుకున్నాను ఎంత పిచ్చిదాన్ని!

అయినా శశి పెళ్ళి చేసుకున్నా ఈ ఇంటికి సహాయం చేస్తాను అని ఎన్ని కోతలు కోసింది మైగాడ్! అవన్నీ నాలుక చివరిమాటలేనా? అసలు ఇలా ఎందుకు చేసింది? దానికి కారణం నా గుండె లోతుల్లోనుండి సమాధానం వచ్చింది నా మనసు కూడా అదే నిజం! అదే నిజం!! అని ఏకగ్రీవంగా ఒప్పుకుంది అదే ''స్వార్థం''

స్వార్థం! ఆ రెండక్షరాలలో నాకు అంతవరకూ తెలియని కొన్ని జీవిత సత్యాలు అప్పుడు కనిపించాయి 'స్వార్థం!'' పళ్ళుబిగువున అనుకున్నాను

మరి! మరి! నా గతేంటి? నా దారేంటి? మరి మరి నేను నా కిరణ్‌ని ఎలా పెళ్ళి చేసుకోవాలి? ఎలా! ఎలా! నా కిరణ్‌ని ఏంచెయ్యాలి? నువ్వు నాకు ఎలా అందుతావు కిరణ్ నేను ఊబిలో కూరుకుపోతున్నాను హఠాత్తుగా ఏడవసాగాను

(ఇంకా వుంది)

చీరలు
100% *టెరిన్ మరియు
100% కాటన్





మంచి అభిరుచి తగిన ధరలు.

# ఎన్‌లైవ్స్

*TERENE®

నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్ (తమిళునాడు మరియు పాండిచెరి) లి.
భారత సర్కారువు ఒక ఉద్యోగ సంస్థ
10/64 సోమసుందరం మిల్స్ రోడు, కాయమత్తూరు-641009

MCA-NTC-76-TEL

ఇండెంటింగ్ ఏజెంట్లు: ● (ఆంధ్రప్రదేశ్-ఉత్తరం) బాలాజీ టెక్స్‌టైల్ ఏజెన్సీస్, 3-4-394, టుబాకో బజార్, సికింద్రాబాద్-3. ● (ఆంధ్రప్రదేశ్-కోస్తల్) సంగం టెక్స్‌టైల్ ఏజెన్సీస్, 230, మొదటి అంతస్థు, డి.బి. రోడ్, ఆర్.ఎస్. పురం, కోయంబత్తూరు-2. ఎన్.టి.సి. దుస్తులు అన్ని ఎన్.టి.సి. షోరూములలోను లభ్యమగును.

స్టాక్ - కమ్ - సేల్ డిపో

ఆర్. పి. డిస్ట్రిబ్యూటర్సు, 3-4-394, టుబాకో బజారు, సికింద్రాబాద్ ఆంధ్రప్రదేశ్

( గత సంచిక తరువాయి )




























[ఇంకా ఉంది]




**కె ఎస్. ఎస్ — కల్వకుర్తి**

కాలు జారితే కింద పడతారు హృదయం జారితే ?

ఎవరి పాలైనా పడరారు!

ప్రతి భార్యా తన భర్తను తెలివి తక్కువ వాడని అనుకుంటుందా?

అనుకోదు అనుకున్ననాడా కాపురం సవ్యంగా సాగదు

**జి ఎస్ — బొంబాయి**

మగవాడు బయట పులిలాగా తిరిగినా భార్య దగ్గిర పిల్లిలాగా అవుతాడు

అలాగా? ఆఫీసరు దగ్గిర పిల్లి, ఇంటి దగ్గర పులీ అనుకుంటున్నానే?!

**జి ఎస్ — హైదరాబాదు**

మీకు రాజకీయాలు ఎందుకండీ. వంటింటి కుందేలులాగా ప్రశ్నావళి సమాధానాలు రాస్తుంటే చాలు ..

అలాగా? మీలాంటి మేధావులు రాజకీయాల నేల్తారు కాబోలు !!

**స్వామి — హైదరాబాదు**

మగవాళ్లకి కాస్త కలలు కనే తత్వం అన్నారే మరి మీ ఆడవాళ్లది ?

కల నిజం చేసుకోవాలన్న తాపత్రయం.

**డి వి ఆర్. — మధిర**

రచయిత్రుల్లో సామాజిక స్పృహ వుందా అన్న ప్రశ్నకు నేను ఆంధ్ర జ్యోతిలో రాసినలేఖను మీరేదోఅన్నారట కదండీ, విశ్వసనీయంగా తెల్సింది.

అఘోరించినట్లే వుంది మీ పరిశోధనా పటిమ. మీ పేరు వినలేదు మీరేం రాశారో నేను చదవనూలేదు ఇక సామాజిక స్పృహ గురించి మీలాంటి 'అలాగట— ఇలాగట' వాళ్లతో చర్చించే వ్యవధి లేదు నాకు. అలాంటి వ్యవధి కాస్త చిక్కితే రామకోటి రాస్తాను.

**సూరిబాబు — హైదరాబాదు**

కొన్ని సందేహాలు ఎంచక్కా మెయిన్ రోడ్డులో పోతూవుంటే, మీరు మాత్రం వాటికి సమాధానాలు అర్థం మారేట్లు మీకు అనుకూలంగా వుండేట్లు ప్రక్కదారులకు మళ్లిస్తారేం?

ఆంధ్రలో రోడ్ల మీద ప్రయాణమే నరకం ఇక ఏ పక్కదారి దగ్గిర దారి అయితే అది పట్టుకు పోవడంలో తప్పులేదు చేరవలసిన గమ్యం నిర్ణయించుకున్నదే కనుక.

**వీస్ డి వీస్ — ఖమ్మం**

... ఆమె నిర్లక్ష్యమైన వైఖరి నన్ను చాలాబాధ పెట్టింది. నేను చనిపోతే నా ఆత్మశాంతి కోసం రెండు కన్నీటిబొట్లు కూడా విడవడానికి ఒప్పుకోలేదు.

ప్ప్ ! ఎంత శిలాహృదయం దేవదానం ! చూడు లోభిని అడగడం తప్పు. అయినా యీ చావూ కన్నీరు, ఆత్మ. . . ఇదంతా ఏమిటి పిచ్చిగాని. అందమైన ఆడదాన్నల్లా ఆ'శరీరకం'గా ప్రేమించేస్తూ యిలా కన్నీటి బొట్లు విడవవా అని ప్రాధేయ పడడం సిగ్గులేని ప్రవర్తన.

**ఎమ్. బి ఆర్ — బొబ్బిలి**

కలవని దారులు కల్సినప్పుడు ఆ దారులు ఎలా వుంటాయి, ముందుకు ఎలా పోతాయి ?

అవి ముందుకు పోవు సరికదా పూర్తి ట్రాఫిక్ ట్రబుల్ తెస్తాయి. కలవని దారులు కలిస్తే ఏక్సిడెంటు అవుతుంది

**ఎస్. ఎన్. — నరసారావుపేట**

యదార్ధం రాస్తే ప్రచురించరెందుకు ? కార్డుపై పూర్తి చిరునామా వుంటేనేనా జవాబులిచ్చేది ?

మీరు యదార్ధం చెప్పినంత మాత్రాన నిరూపణ లేక ఎలా నమ్మడం? వ్యక్తులపై మీ అభిప్రాయాలకీ నాకూ ఏమిటిసంబంధం? (2) అవును పూర్తి అడ్రసు యివ్వని కార్డులు చింపేస్తాను.

**కుమారి శాంత — ఆకునూరు**

అందరూ నన్ను జూనియర్ రామలక్ష్మి అంటారు. నాకు భయంగా వుంది ఆరుద్ర గారొస్తారేమోనని. అప్పుడు మీరూ నేను ఏమవుతాం ?

కుమారి శాంతా ! నువ్వు కుమారివి కావు తెలుస్తూనే వుంది ! "జూనియర అని ఎవరినంటారు ? సంతతిని అంచేత నీకేం ఫరవాలేదు నువ్వునాకు కూతురివైతే నా లుగు మొట్టి కాయ లు కొట్టైనా కాస్త మాటలకిఅర్థాలు నేర్పించివుందును. తెలివిలేని వాళ్ళన్నా, అతితెలివి ప్రదర్శించేవాళ్ళన్నా నాకు ఒళ్లు మంట!

**ఎల్ వి యు. — భువనేశ్వరు**

నాక లైఫ్‌లో థ్రిల్ లేదు కన్పించటంలేదు ఏదైనా చిట్కా చెప్తారా ?

ఏం లేదు ఒక్క పది రోజులు ఆంధ్రలో క్యాంపు వేసి తెలుగు సినిమాలు చూడడమే — విరుగుడు

**జి వి. ఎమ్ — విశాఖపట్నం**

ఏ విధమైన కృషి అక్కరలేని పనిలో చేరాలని వుంది రామలక్ష్మిగారూ. కొంచెం చెప్పి పుణ్యం కట్టుకోండి

పొలిటిక్సు రాజకీయాల కొక్క దానికే —ఏ విధమైన తయారీ అవసరం లేదని వినికిడి. ప్రయత్నించండి

**రఫీ — గుంటూరు**

భిన్నత్వం అంటే ఏమిటి?

ఏకంగా వుంటూ వేర్వేరు దృక్పథాలు కల్గి వుండడం

ఏకత్వం అంటే ఏమిటీ ?

విడివిడిగా వుంటూనే ఏకాభిప్రాయం కల్గి వుండడం

భిన్నత్వంలో ఏకత్వం అంటే ?

విడివిడి దారులు వ్యక్తులూ అయివుండీ ఒకే భావన కల్గి — పోవడం ముందుకు.

**జె. బి. ఆర్ — మొగలపల్లి**

సూర్యుడు వెలుగునిస్తాడు. చంద్రుడువెన్నెల నిస్తాడు మరి ఆడది ?

మీ అందరికి జన్మనిచ్చేది ఆడదే గదండీ ? మరిచి పోయారా?

**ఎమ్. ఎమ్. — కాకినాడ**

సంతోషానికి నిర్వచనం ?

ఎప్పుడూ ఎవరూ అనుకున్నంత సంతోషంగా గాని, అనుకున్నంత దుఃఖంగా గాని వుండరు. అందుకే నిర్వచనం లేదు.



# శాపం

## కప్పగంతుల మల్లికార్జునరావు



'ఏటికి వీరనీళ్ళు వచ్చాయట! అసలే మీ ఆరోగ్యం బాగాలేదు. స్నాన సంధ్యాదులకు ఇంట్లోనే ఏర్పాటు చేస్తాను మావగారూ. పైగా యీ రోజు...'

కోడలు సుభద్రవైపు చూచి ఆప్యాయంగా నవ్వేడు చైనులు.

అవును. ఆ రోజు ఆ యింట్లో ఏదో విపరీతం జరగబోతున్నది!

'ఫర్వాలేదమ్మా. అనాదిగా పాటిస్తున్న వో మంచి ఆచారాన్ని ఎందుకు వదులుకోవటం? త్వరగా వస్తాగా!' అంటూ చైనులు గడప దాటుతున్నాడు.

'ఆదెయ్యను కలుస్తామన్నాడు, గుర్తుందిగా మామగారూ?'

కోడలి ఆందోళన, ఆమెలోని తల్లి మనసును అర్థం చేసుకోగలడు చైనులు. 'వుందమ్మా' అంటూ గడపదాటి వీధిలోకి వెళ్లేడు.

లోకాన్ని ఆవరించిన చీకటి యింకా పూర్తిగా పోలేదు, వెలుగు విచ్చుకోలేదు. ఆకాశంలో మబ్బులు, మూఢుడి మనస్సులోని తమస్సులా, నల్లగా వున్నాయి. చలిగాలి రివ్వున వీస్తున్నది.

నిన్న హృదయం ఆరంభమయిన వర్షం రాత్రంతా కురుస్తూనే వుంది వో గంట క్రితమే తగ్గింది వీధుల్లో జన సంచారం ఆరంభం కాలేదు యింకా. బురద బురదగా అయిన ఆ రోడ్డుమీద నడుస్తున్న మొదటి బాటసారి చైనులే!

అది వొకప్పుడు బ్రాహ్మణ అగ్రహారం రెండు వేల గడపలున్న ఆ గ్రామ వీధులో విద్వత్తు నాట్యం చేసేది ప్రజల్లో ధర్మ నిరతి పట్ల విశ్వాసం వుండేది నీతి తప్పితే పాపమన్న భయం వుండేది.

కాలం మారింది విద్వత్తుకు విలువ తగ్గింది బ్రతుకు భారం కాసాగింది జీవితంలో వ్యాపార దృక్పథం ప్రవేశించింది ఉన్న కాస్త భూ వసతుల్ని రైతులకు అమ్ముకొని కడుపు చేత పట్టుకొని విద్యాంసులంతా తలా వో దిక్కుకూ వలస వెళ్ళేరు

చైనులికి ఆ వూళ్ళో వో యిల్లు తప్ప ఆస్తులేం లేవు పాండిత్యమే తనకున్న తరగని ఆస్తి అన్నట్లు బ్రతికేడు అదే యిప్పటికీ జీవనాధారం

అయినా చైనులికి ఆ వూరిని వదిలి వెళ్ళటానికి మనస్కరించలేదు ధర్మాన్ని వదల లేదు పైగా అందరూ వదిలేసిన ధర్మ రక్షణ భారాన్ని నెత్తిన వేసికొంటున్నట్లు కొడుకు రామశర్మను తన మార్గంలోకి దించేడు తనంత పండితుని చేయాలనుకొన్నాడు

కానీ రామశర్మకు ఆ దృష్టి, ఆ వుత్సాహం లేవు ఫలితంగా అతని పని 'ఉభయ భ్రష్టత్వం' అన్నట్లయింది అటు తండ్రి విద్య అంటలేదు ఇటు కొత్త వుద్యోగ విద్యల్ని నేర్చే ప్రయత్నం చేయలేదు యిక ధర్మాన్ని ఏం వుద్ధరిస్తాడు?

చెడు సావాసాలు పట్టి చెడు తిరుగుళ్లు తిరిగేడు విషయలాలసతతో అధర్మమార్గాలలో సంచరించాడు కడకు భార్యను, యిద్దరు పిల్లల్ని చైనులు నెత్తిన వదిలేసి అనారోగ్యంతో కళ్ళు మూసేడు.

ఎక్కొచ్చిన చెట్లు, పండ్లు యివ్వవలసిన కాలంలో కుళ్ళిపోయి, ఆ పిదప ఎండి రాలిపోతే ఆ చెట్లును నాటిన తోటమాలికి ఎలా గుంటుంది? చైనులు స్థితీ అలాగే అయింది.

దుఃఖాన్ని దిగమింగుకొన్నాడు. సన్యాసాశ్రమాన్ని స్వీకరించి శాంతంగా జీవితాన్ని గడుపుదామనుకుంటున్న తరుణంలో తిరిగి కుటుంబ జంఝాటంలో పడక తప్పలేదు.

# ఎస్కార్ట్స్ ఒక విప్లవానికి అగ్రగామి




## ఈ దశాబ్దం ముగిసే నాటికి 3 కోట్ల టన్నుల ఆహార ధాన్యాలను ఉత్పత్తి చేయటంలో రైతులకు తోడ్పడే యంత్ర సామగ్రితో ఆధునిక వ్యవసాయాన్ని ప్రోత్సహించటం




వ్యవసాయ యంత్ర పరికరాల రంగంలో ఎస్కార్ట్స్ మార్గదర్శకంగా నిలిచింది. గత 30 ఏండ్లలో 1 50 000 ఎస్కార్ట్స్, ఫోర్డ్ ట్రాక్టర్లు వ్యవసాయోత్పత్తులలో విప్లవాత్మక ప్రగతిని సాధించాయి. గ్రామ ప్రాంతాలలో ఉద్యోగ అవకాశాలను పెంపొందించాయి.

ఎస్కార్ట్స్, భారత దేశ రైతు సోదరులకు ఈ నాడు అత్యధిక రకరకాల వ్యవసాయ యంత్ర సామగ్రిని అందజేస్తోంది. రైతుకు కేవలం అధికోత్పత్తి మాత్రమే కాదు, మిక్కిలి తక్కువ ఖర్చుతో అధిక సామర్థ్యం, నిర్వహణ ఖర్చు కూడా చాల తక్కువ ఉండేట్లు చూస్తున్నది. దేశ వ్యాప్తంగా ఉన్న 400కు పైగా డీలర్ల కేంద్రాలు గొప్ప సర్వీస్ సదుపాయాలు కల్పిస్తున్నాయి. దాంతోపాటు ఒరిజినల్ స్పేర్ పార్ట్స్ అందజేస్తున్నాయి.

"భారత దేశపు వ్యవసాయ యాంత్రీకరణ ప్రభావం" అన్న అంశం మీద నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లైడ్ ఎకనమిక్ రిసెర్చ్, కౌన్సిల్ జరిపిన బృహత్తర సర్వేలో ట్రాక్టర్ల వల్ల సగటున హెక్టారుకు 63% వ్యవసాయోత్పత్తుల విలువ పెరిగినట్లూ, అదనంగా 38% కూలీలు అవసరం అయినట్లూ రుజువయిందని పేర్కొన్నారు. ఆ రకంగా మెరుగయిన సాంకేతిక పరిజ్ఞానంతో, పరిశ్రమ-ఉపాధి పెంచుతున్నప్పటికీ ప్రతి ఒక్కరి జీవన పరిస్థితి బాగుపడింది.

ఈ నాడు ఒక టన్ను కాయ ధాన్యాలు ఒక టన్ను క్రూడాయిల్ కన్నా విలువగలవి. వ్యవసాయాన్ని త్వరగా ఆధునికం చేయటం ఆహార ధాన్యాల ఉత్పత్తిలో మిగులు సాధించటం ద్వారా మనదేశం విదేశీ మారక ద్రవ్యం కొరత సమస్యలను పరిష్కరించటంలో ఎంతో దోహదపడుతుంది.



ఫోర్డ్ మన దేశానికి తాజాగా ప్రపంచ ట్రాక్టర్ పరిజ్ఞానాన్ని

**భారత దేశపు కలకాల అవసరాలకు సరిపడే అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని అనుసరిస్తోంది.**

## ఎస్కార్ట్స్ లిమిటెడ్

11 ఇండియా హౌస్, కన్నాట్ సర్కస్, న్యూ ఢిల్లీ-110001.

ట్రాక్టర్లు-వ్యవసాయ యంత్రసామగ్రి ● మోటారు సైకిళ్లు ● ఆటోమోటివ్ ఏన్సిలరీస్ ● ఇండస్ట్రియల్ అండ్ కన్‌స్ట్రక్షన్ ఎక్విప్‌మెంట్ ● రైల్వే ఏన్సిలరీస్ ● హీటింగ్ ఎలిమెంట్స్.

కానీ అప్పటికి విద్వత్తుకు విలువ పూర్తిగా పోయింది వేదార్థాలని ఉపనిషత్ సారాలని గ్రహించే తీరిక వోపిక, వుత్సాహాలు ఎవరికున్నాయ్ ? అన్ని వృత్తులలోలాగానే బ్రాహ్మణ వృత్తిలోనూ ఆముదపు చెట్లు మహావృక్షాలుగా చెలామణీ కాసాగేరు. పాండిత్యం, నీతి, ధర్మం - అన్న పదాలు అర్థాలు మార్చుకోసాగేయి

అంచేత కొడుకు విషయంలో చేసిన తప్పును మనవడు మనవరాలు లను ఇంగ్లీషు చదువులో చేర్పించి, దిద్దుకొన్నాడు. వాళ్ళిద్దరూ, సహజఎరువులు తిని ఎదిగిన మొక్కల్లా, చైనులు పర్యవేక్షణలో చదువుల్లో వికసించారు

కృష్ణశాస్త్రి యమ్మెస్సి పాసయ్యాడు. లలిత డిగ్రీ చివరి సంవత్సరంలోకి వచ్చింది. తన బాధ్యతలు తీరి, కష్టాలు గట్టెక్కే కాలం వచ్చిందని సంతోషించాడు చైనులు. శేష జీవితాన్ని వైరాగ్యసాధనలో గడుపుదామను కొన్నాడు.

కానీ . ? ?

* * *

"జయాయ జయభద్రాయ హర్యశ్వాయ
నమోనమః
నమో సహస్రాంశో ఆదిత్యాయ
నమోనమః"

## నిషా

సూర్యుడికి అభిముఖంగా నదిలో నిలబడి ఆదిత్య హృదయాన్ని పారాయణ చేయటం చిన్నప్పటి నుంచీ చైనులు ప్రాతఃకాల విధులలో వొకటి ఆవేళ ఆకాశంలో సూర్యుడివి, నల్లటి మబ్బులు కట్టిపడేసి నిర్బంధంలో వుంచేయి. అయినా చైనుల కళ్ళముందు అద్భుతమైన అరుణకాంతే !

అధర్మాన్ని శిక్షించి ధర్మాన్ని రక్షించే వాడిలా సూర్యుడు మబ్బుల్ని చీల్చుకొని, తెల్లటి వెలుగును, వెచ్చటి కాంతిని, లోకం మీద ప్రసరించాడు చైనులు తనువు వొక్కసారిగా పులకరించింది నదిలో పరవళ్ళు తొక్కే నీరులా ఆయన హృదయంలో ఆలోచనలు పరవళ్ళు తొక్కేయి మళ్ళీ.

'నా యింటికి చుట్టుకొన్న చీకటి పోయేదెలా ?'

ఆదిత్యునికి అర్ఘ్యం వదిలి నమస్కరించి వొడ్డుకు వచ్చాడు చైనులు బట్టలు పిండి కట్టుకొని, రాగిచెంబు నిండా నీళ్ళు ముంచుకొని గృహోన్ముఖుడయ్యాడు

కృష్ణశాస్త్రి లలిత ఎదిగిన వో భారతీయ యువకుడు - యువతి ! యిరుపురికీ రెండు సమస్యలు !

కుటుంబ జీవితంలో చీకటి కోణాలు !

యమ్మెస్సీ పాసయిన కృష్ణశాస్త్రి నిరుద్యోగి. తిరగని వూరు లేదు. ఇంటర్వ్యూకి వెళ్ళని ఆఫీసుకి లెక్కలేదు ఖర్చయిన డబ్బు వివరాలున్నాయి మనస్తాపమే లాభం !

వారం క్రితమే ఢిల్లీనుంచి మరో వారంలో ఇంటర్వ్యూకి పిలుపు

"నా పుట్టుకేనాకు శాపం తాతయ్యా, నాకు వుద్యోగం రాదు ఇంటర్వ్యూలు వొట్టి ఫార్సులు, నేను వెళ్ళను" భీష్మించుకు కూర్చున్నాడు.

ఎక్కడనో వడమకొన్న రామశర్మ ఎండి పోవటానికి కారణం స్వయంకృతాపరాధం. కానీ కృష్ణశాస్త్రి యువకుడుగా తన ధర్మాన్ని తాను నెరవేర్చాడు. అతను అలా నిరాశా నిస్పృహలో కృంగిపోవటానికి కారణం ఏమిటి ? ఆ దోషం వ్యక్తిలో వుందా ? వ్యవస్థలో వుందా ?

అతడిలో ఆత్మస్థైర్యాన్ని పెంచటాని కన్నా అతడిని ఢిల్లీకి ఆ యింటర్వ్యూకి పంపాలి - కానీ తనకాశక్తి ఏది ?

ఆలోచిస్తూనే ఆగేడు చైనులు. వచ్చిన దారిన కాకుండా ప్రక్కగా ఉన్న వో బాటన నడవసాగేడు ఆ బాట హరిజన వాడమీదుగా వూళ్ళోకి వెళ్తోంది

యిక లలిత –

కృష్ణశాస్త్రిలా లలిత సుఖదుఃఖాలను పైకి చెప్పుకోదు అంతర్ముఖి ఆమె మనసులో ఆలోచన తెల్సుకోటం చాలా కష్టం మాట అమిత మట్బసం.

ఆమె తనక్కావల్సిందేమి అడగదు. తల్లి కని పెట్టి తీర్చాల్సిందే

'లలిత పెద్దదయిందండీ మామగారూ. దానికి చదువుమీద ధ్యాసతగ్గింది పెళ్ళి జేస్తే మంచిదేమో అనిపిస్తున్నది'

సుభద్ర అంతదూరం ఆలోచించిందంటే అది అవశ్య విషయమే!

కానీ ఆడపిల్ల పెళ్ళి చేయటం తన వల్ల అయ్యేపనేనా? కృష్ణశాస్త్రి వుద్యోగి అవుతే చెల్లి పెళ్ళి బాధ్యత తీసుకుంటాడని ఆశించాడు చైనులు. కానీ అతనే కాళ్ళనిలదొక్కుకోలేదాయె!

'అమ్మ లలితా. నీకు పెళ్ళి చేయాలను కొంటున్నాం. ఏమంటావ్?'

కుటుంబ స్థితిని గమనించి 'యిప్పుడేం తొందరలే తాతయ్యా? అన్నయ్యకు వుద్యోగం కానీయండి' అని లలితే అంటుందేమోనని చైనులు ఆశ

కానీ లలిత ఎగతాళిగా నవ్వి ఏమన్నది?

'పెళ్ళి చేస్తానంటే ఏ ఆడపిల్ల వద్దంటుంది తాతయ్యా? మీ యిష్టం'

యిక చేసేదేముంది? అన్వేషణలు, అవమానాలు?

సంబంధాలు వచ్చాయి పిల్ల అందరికీ నచ్చింది. ఎటొచ్చీ కట్నాలవద్దే పేచీ!

'పిల్ల అందాన్ని, కుటుంబసంప్రదాయాన్ని చూచి వూరికే ఎవరు చేసుకొంటారండీ. అనవసరంగా మాకు రైలు ఛార్జీలు దండుగ. చేతకానివారు చేతకానట్టు వూరుకో కూడదూ?' అంతా విసుక్కుపోయినవాళ్ళే.

'తాతయ్యా! పెళ్ళి చేయటం అంటే వేదమంత్రాల పఠనంకాదు నీకు చేతకాదులే ఎందుకు అనవసరంగా నువ్వు అవమానపడి నన్ను అవమానంపాలు చేస్తావు? నా పెళ్ళి నేనే చేసుకొంటాలే.'

ఎలా? — అనుమానాలు. భయాలు, కానీ లలితను తను ఏమనటం?

ఆలోచిస్తూనే చైనులు హరిజనవాడలో ప్రవేశించాడు.

ఒకప్పుడు — ఆయన హరిజనవాడలో అడుగు పెట్టటమే అదృష్టం అనుకున్న కాలంలో — అతను వాళ్ళ యిళ్ళకు పోయి మంచిచెడ్డలు విచారించాడు.

'అంటరానితనం ధర్మవిరుద్ధం. అసలు కులవ్యవస్థ గుణకర్మ ప్రాతిపదికలపై నెలకొల్పబడింది. బ్రాహ్మడిగా నా ధర్మాన్ని నేను విసర్జించిననాడు నేను బ్రాహ్మణుడిని కాను కులంహీనుడిని'' అని అతను ధర్మ బోధనలు చేస్తుంటే 'ఆదిత్య అవతారం, అగ్నికి అనుంగు సోదరుడు' అని పొగిడేవారు.

కానీ యివాళ? ఆయనని చూచీ చూడ నట్లు తల దిప్పుకొంటున్నారు అక్కడిజనం. మొహాలు ముడుచుకొంటున్నారు — కొందరు అతడి వేషాన్ని ఎగతాళి చేసుకొంటూ మాటాడుతున్నారు, మరికొందరు అతడిని అస్పృశ్యుడిని చేసి తమ వాడలోకి వచ్చినందుకు విమర్శిస్తున్నారు.

'ఆదెయ్యా' వొక చిన్న యింటిముందు నిలబడి చైనులు కేకవేసేడు నాలుగైదు సార్లు పిలవగా లోపలినుంచి వో మధ్యవయసు యువతి బయటికి వచ్చి చైనులును చూచి మొహం చిటిలించింది

'ఆదెయ్య యింట్లో వున్నాడా లక్ష్మమ్మా?''

'నా పేరు లక్ష్మమ్మకాదు మోహదున్నిసా'' అంది కర్కశంగా ఆమె

''అలాగే ననకో పేరులో ఏముంది?''

''తా పెద్దకోతి వనమంతా చెరిపిందని. . మీరు బాగుపడరు ఇంకోర్ని బాగుపడనివ్వరు. మీ యవ్వారం ఏం బాగా లేదండీ.''

''ఏం జరిగిందమ్మా ఎందుకలా వుద్రేక పడ్తావు?''

''వాడ వాడంతా వో దోవన నడుస్తుంటే యీ డొక్కడూ మరో దోవన నడుస్తానంటాడు మీ వల్ల కాదూ? ఆడి బుర్రలోకి ఏ శాస్త్రాలు ఎక్కించేరో ఏమో? మాఇంటికి యిసమై సంపుతోంది''

''అయ్యయ్యో నాకేం తెలీదమ్మా. యింతకి ఆదెయ్య లేడా యింట్లో?''

''లేదుకానీ ఆదెయ్యను షైజహాసును సెయ్యాల్సిన బాద్దెత మీమీదే వుందట మీ మాట వాడికి గురి లేకపోతే మా వుసురు కొడ్తుంది మీకు. ఊ...''

ఆమె లోపలికిపోయి విసురుగా తలుపు మూసుకొంది.

చైనులు 'వుస్సు'రనుకొంటూ వెనక్కి తిరిగేడు

మేఘాలు లేని ఈ జడివాన ఏమిటి?

ఆదెయ్య రామశర్మ స్నేహితుడు. అసలు పేరు ఆదినారాయణ

చైనులంటే అతనికి మొదటినుంచీ భక్తి గౌరవాలున్నాయి.

రామశర్మ యితడిని చెడగొట్టేడో, లేక యితనే రామశర్మను చెడగొట్టేడో, లేక యిద్దర్నీ యింకెవరన్నా చెడగొట్టేరో కాని యిద్దరూ చెడుమార్గాల్లో పడ్డారు.

రామశర్మ చచ్చిపోయి భార్యా బిడ్డలకు దూరమయ్యాడు ఆదెయ్య బతికి వుండీ భార్యా పిల్లలకేకాక, హరిజన వాడకీ మొత్తం వూరికే దూరమయ్యాడు. అతను తాగుతాడు. జూదం ఆడుతాడు ముండల ముఠాకోరు. పోనీ యివన్నీ రహస్యంగా చేస్తాడా అంటే లేదు పైగా తాగి బజారునపడి అందర్నీ



## నిషా

తిడా డు దొంగతనాలు కూడా చేసా డు: చెప్పుకొంటారు.

ఊరు మొత్తానికి 'రౌడీ వెధవ', పనికి మాలిన వెధవ

అంతా తిట్టేవారేకాని అతడితో మంచి మాట మాట్లాడేవారు వూళ్ళో ఒక్కరూ లేరు సంఘ బాహ్యుడికింద చూస్తారంతా. అతనూ ఎవరినీ లెక్కచేయడు ఎప్పుడూ నిషాలోనే వుంటాడు

అతడు లెక్కచేసేది చైనుల్నే అతన్ని మనిషికింద చూచి అతని బలహీనతలకు జాలిపడి, మంచి మాటలు మాట్లాడేదీ చైనులే!

'తాగుబోతునని, తిరుగుబోతునని నన్ను తిట్టి విడవలేకానీ, నాకన్నా ఏదవలయ్యా ఆ జనం? డబ్బునిషా ఎక్కి సతున్నారు జనం దర్మాదర్మాలు ఎవరిక్కావాలయ్యా? మా ఏదవలంతా మతం మార్చుకొంటారుట'

ఆ మధ్య వూళ్ళో హరిజనులకీ, భూస్వాములకీ మధ్య ఏవో స్పర్థలొచ్చాయి దాన్ని ఆధారం చేసుకొని కొందరు హరిజన యువకులు విజృంభించారు తమ పెద్దలకి మతం మార్పిడిని గురించి నూరిపోసేరు. ఆ యువకులకి నాయకుడు మాధవ్

మాధవ్ పట్నంలో పెద్ద చదువులు చదివేడు కాలేజీ రాజకీయాల్లో ప్రముఖ స్థానం వహించాడు చదువు అయ్యాక పెద్ద వుద్యోగం వచ్చింది కూడా కానీ అతను వుద్యోగాన్ని కాదని గ్రామంలో తనవాళ్ళను వుద్ధరించడానికి కంకణం కట్టుకొన్నాడు.

'ఆడు- ఆ మాదవ్‌గాడున్నాడే బాబు గోరూ- ఆ డొట్టి ఎదవ అడికి అసలు మతం వుంటే కదా మార్చుకోటానికి! ఏడనుంచో డబ్బు సంపాదించడానికి విత్తులు. ఆశపెట్టి వాడలో జనంసేత యిసం తివిపిస్తున్నాడయ్యా'

ఆ రోజు ఆదెయ్య చెప్తుంటే ఆ విషయాన్ని గురించి చైనులు పట్టించుకోలేదు.

కానీ వున్నట్టుండి హరిజన వాడవాడంతా ఒక్కసారిగా ముసిల్ములుగా మారినట్లు వార్త గుప్పుమంది. వాడలో పిల్లా పాపలతో సహా అందరి పేర్లూ మారిపోయాయి. తమని అస్పృశ్యులుగా చూచి అవమానాల పాలు చేస్తున్నందువల్లే ఆత్మాభిమానంతో మతం

మార్చుకొన్నామన్నాడు మాధవ్ ధనాశతో ఆ పని చేసేరని కొందరు విమర్శించారు

చిత్రం ఏమంటే అంత వాడలో నూ మతం మార్చుకోని కుటుంబం ఆదెయ్యదే. అది చిత్రంగా చెప్పుకొన్నారంతా!

యిది జరిగేక ఆదెయ్య చైనులుకి కనిపించనేలేదు ఇవాళ అతనిలో పనుండి యింటికి వెళ్తే అతని భార్య లలిత మతం మార్చుకోక పోవటానికి కారణం చైనులని నిందించింది

యిలు దగ్గరవుతోంది చైనుల శరీరమంతా ఏదో నీరసం ఆవహించింది ఆఖరి ప్రయత్నంగా ఆదెయ్యను అప్పు అడిగి మనిషిని ఢిల్లీ పంపేద్దామనుకొన్నాడు యిక యిప్పుడేం చేయటం?

'దండాలండీ చైనులు బాబుగోరూ..'

ఇంటి అరుగుమీద ఆదెయ్యను చూస్తూనే ప్రాణం లేచివచ్చినట్లయింది చైనులుకు కానీ ఆదెయ్య మంచి నిషాలో వున్నాడే?

* * *

తన పెళ్లి విషయంలో లలిత వో నిశ్చయానికొచ్చేసింది. తన నిర్ణయాన్ని తల్లితో తాతయ్యతో చెప్పాలి, కానీ యిదేమిటి?

మనసు సంశయాల పుట్ట అవుతున్నదేం? గుండె దడదడలాడుతున్నదేం? నాలుక ముద్ద కట్టుకుపోతున్నదేం? తన ధైర్యమంతా ఎక్కడికి పోయింది?

'తాతయ్యా! నా పెళ్లి నేనే నిశ్చయించుకొన్నా''

'సంతోషమమ్మా వరుడెవరు?'

'వరుడు... మాధవ్.. అదే-మహమ్మద్ ఇబ్రహీం'

చైనులు కళ్లు ఎర్రబడ్డాయి. కోపంగా లేచాడు తల్లి ఏడుపు, మొత్తుకోళ్లు ఆరంభించింది

'అంటే నువ్వు – నువ్వు మతం మార్చుకొంటున్నావా?'

'ఏం తప్పా? నాకు మైనారిటీ తీరింది. గుర్తుందా?'

చైనులు కోపంగా ఏమో అంటున్నాడు. తను అంతకన్నా పెద్దగా వాదిస్తున్నది. మధ్యలో తల్లి ఏడుపు, కన్నీరు. అంతా గందరగోళం.

* * *

ఆలోచనా మాత్రంగానే లలిత మనసు గందరగోళమయింది పెద్దలతో ముందుగా చెప్పి పర్మిషన్ తీసుకోకపోతేనేం?

కాగితం, కలం తీసుకొని తన ఆలోచనల్ని నిర్ణయాన్ని రాసింది. ఉత్తరాన్ని కవర్లో పెట్టింది.

ముందు చావిడిలో చర్చ చెవినబడింది కవరు చేత బట్టుకొనే గడిదాటి సావిట్లోకి వచ్చింది.

అక్కడ చైనులు, కృష్ణశాస్త్రి, సుభద్ర, ఆదెయ్య వున్నారు. చర్చనీయాంశాన్నిక్షణంలో గ్రహించింది లలిత తాత, తల్లి, కృష్ణశాస్త్రికి డబ్బిచ్చి, ఎలాగైనా ఢిల్లీకి పంపాలని ప్రయత్నిస్తున్నారు అతను వెళ్లనంటున్నాడు.

'తాతయ్యా మీ ఆరాటాన్ని, ప్రేమను నేను అర్థం చేసుకున్నాము, కానీ మీరు కూడా నా మనోస్థితిని అర్థం చేసుకోండి. చాలా తీవ్రంగా ఆలోచించి నేనో నిర్ణయానికొచ్చాను నా నిర్ణయాన్ని విని కేవలం తప్పులుపట్టే దృష్టితోకాక సానుభూతితో అర్థంచేసుకొని ఆలోచించండి'

కృష్ణశాస్త్రి మాట్లాడటం ఆపి అందరివైపూ చూచాడు. వొక్క ఆదెయ్య తప్ప అంతా అతని నిర్ణయంకోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నారు ఆదెయ్య గుంజకు ఆనుకొని జారగిలబడి, నిషా నిండిన కళ్లతో యింటకప్పును చూస్తున్నాడు

'యిది రిజర్వేషన్ల యుగం తాతయ్యా మనిషికి అత్యద్భుతమైన ప్రజ్ఞ, మేధా సంపత్తి అయినా వుండాలి. కాకపోతే రాజకీయంగా, ఆర్థికంగా, పలుకుబడివున్న కుటుంబంలోనో, అతితక్కువ కులంలోనో పుట్టాలి మిగతా వారంతా త్రిశంకు సంతతే పైకి పోలేరు క్రిందస్థానంలేదు మధ్యలో మా కోసం వో స్వర్గాన్ని కట్టటానికి విశ్వామిత్రుడు యింకా పుట్టలేదు.

మనవూళ్లో హరిజనులంతా ముస్లింలుగా మారిపోయారు. ఆ వార్త విన్నాక నాకో ఆలోచన వచ్చింది. మనం హరిజనులుగా ఎందుకు మారకూడదు? అలాగన్నా మనం రిజర్వుడుక్లాసులోకి చేరిపోతాంగా? వుద్యోగాలొస్తాయిగా? ... పోనీ మీరంతా వొద్దు తాతయ్యా, నేనొక్కడినీ హరిజనుడిగా మారటానికి మీ ధర్మశాస్త్రాల్లో మార్గం ఏమైనా వుంటే చెప్పరూ?'

ఒక్కక్షణం నిశ్శబ్దం. అంతా యిప్పుడు చైనులువైపే చూస్తున్నారు

"నాకు అభ్యంతరంలేదు శాస్త్రీ, నీ బాధను నేను అర్థం చేసుకొన్నాను. కానీ యివాళ మనం పెంచి పోషిస్తున్న తరహా కులవ్యవస్థకే ధర్మశాస్త్రాల్లో స్థానంలేదు. యిక కుల మార్పిడికోసం ధర్మశాస్త్రాల ప్రసక్తి ఎందుకు? అందుకు యీ నూతన ధర్మాల నాశ్రయించాల్సిందే ఆ పైన నీ యిష్టం" చైనులు సభను ముగిస్తున్నట్లు లేవబోయాడు.

"ఒక్కక్షణం తాతయ్యా! కులం మార్పిడికి మీ సనాతన ధర్మశాస్త్రాలూ, యీనాటి ఆధునిక శాస్త్రాలు ఏవీ అంగీక



# నిషా

రించవు కానీ మతం మార్చిడికి అన్ని శాస్త్రాలూ అంగీకరిస్తాయిగా? అయితే నేనూ ఇస్లాంమతంలో చేరిపోతాను'

'శాస్త్రీ' అరిచింది సుభద్ర.

'నువ్వూరుకోమ్మా ఆవేశపడకు' అంటూ సుభద్రతో అని మళ్ళీ తన స్థానంలో కూర్చు న్నాడు చైనులు.

'అయితే మతం మార్పిడితో నీ సమస్య లన్నీ పరిష్కారమయి పోతాయంటావా శాస్త్రీ?'

'ఏమో తాతయ్యా కానీ అక్కడ ఆ ఆశ వుంది. ఆకర్షణవుంది యిక్కడ ఏమీ లేదే! భవిష్యత్తు సంగతెలావున్నా వెంటనే నాకు వాళ్ళు ఉద్యోగం యిప్పిస్తామన్నారు. ఉద్యోగం అక్కర్లేదనుకొంటే వ్యాపారం చేసుకోటానికి డబ్బిస్తారు ఏ ఆశా, ఆధారం లేకుండా నేం బతకటమెలా తాతయ్యా?' కృష్ణశాసి చేతుల్లో మొహం దాచుకొని ఏడవసాగేడు

'అయితే నీ యిష్టం శాస్త్రీ. అదే నీ అభీష్టమవుతే నాకు అభ్యంతరంలేదు' అంటూ చైనులు లేచాడు సుభద్ర వద్ద కెళ్ళేడు. ఆమె కన్నీటిని గుడ్డలోకి కుక్కు కొంటూంది.

'తొలి మానవుడు పుట్టంగానే ఆలోచిం చిందీ, అన్వేషించిందీ తిండికోసమే సుభద్రా. కడుపునిండేకనే మనిషి మతాన్ని గూర్చి ఆలోచించాడు. ఆకలివేస్తో, ఆకర్షణలకు లొంగో, వాటిని సంతుష్టిపర్చే దోవలు వెతుక్కొంటున్నారుకొందరు. వాళ్ళని కాదనే అర్హతమనకు లేదు. తనది వొట్టిభ్రమ అని తెలుసుకొన్న రోజు వాడు మళ్ళీ తిరిగి నీ మాతృత్వపు వొడిలోకి రాకపోడులే. వాడిని ఆశీర్వదించి పంపు.'

సుభద్రమ్మ కొడుకు వైపు మెల్లగా నడుస్తోంది.

'అమ్మా సుభద్రమ్మా. వొక్క చ్చెనం అక్కడే ఆగిపోమ్మా' ఆదెయ్య గుంజకు నిటా రుగా ఆనుకొని కూర్చుంటూ అన్నాడు.

'స్వైమలు బాబుగోరూ. మీరు దెర్మ ప్రెబువులు. నేను తాగుబోతోడిని. తిరుగు బోతోడిని, దొంగని రౌడీని. వూరంతా నన్ను 'పనికిరాని ఎదవ' అని తిట్టింది నా వోశే

## ఎదురు!

మేం –
ఎవరు ఏమిచ్చినా
దాచుకుంటాం
ఎక్కడ ఏమున్నా
దోచుకుంటాం –
మీరు పుట్టించిన పాపలం
మేం! మీ 'పాల'కులం!!

– ఆచార్య తిరుమల

నన్ను ఎలేసేరు కొందరు నన్ను గొంగలి పురుగులా సూత్తారు మరి కొందరు నన్ను యిషప్పురుగులా సూత్తారు ఏదైనా నేను పురుగులాంటోడినే కాని మనిసిని మాతరం కాను. దర్మప్రెబువులకి పురుగు సేత రం సెప్పటం సిత్రంగానే వుంటది కానీ తప్పదు మరింక

సిన్నతనంలో బాగా సదవట్లా లేదని బడి పంతులుగోరు నన్ను కొట్టేరు నేను ఏడు త్తన్నా సదువు రానందుక్కాదు పంతులు గోరు కొట్టినందుకు. అప్పుడో తెలివిగల వోడేం సేసేడో తెల్సా బాబూ, బడి మాని పించి నన్ను తీసికెళ్ళి సీట పేక నేర్పేడు. మరోసారి నాకూ నా పెళ్ళానికీ పోట్లాట వచ్చింది. దాన్ని సితకబాదినా. మనసు బాగా లేక నేను ఏడుత్తా ఎక్కడో కూర్చుంటే మరో మగానుబావుడు ఏం మంతరం సెప్పేడో తెల్సా బాబూ? బాదలన్నిటినీ పోగొ ట్టేది 'సారాయి విషా' యే అన్జెప్పి తీసుకెళ్ళి సారాయి పోయించాడు. సారా అలవాటయ్యాక సంపాదించిన డబ్బంతా తాగుడుకు కర్చు పెట్టేసి వో రోజు కూటికి గింజలు లేకుండా యింటికొచ్చా. అప్పుడు నా పెళ్ళాం వన్నేమని తిట్టిందో తెల్సా? 'మగాడన్నాక దొంగతన మన్నాసేసి పెళ్ళాం పిల్లల్ని పోషించాలిరా. దమ్ముంటే దొంగతనంసేసి సంపాదించుకురా' అంది. పెళ్ళాంసేత అంత మాటనిపించు కొన్నాక దొంగతనం సేయకుండా ఏ మగా డుంటాడు బాబూ? యింకోసారి నా పెళ్ళాం పుట్టింటికెళ్ళి పది రోజులుంది. నా మన సంతా తిక్క తిక్కగా అయిపోయింది. నాకూ నా భార్యకూ తగాదా పెట్టాలని సూత్తన్న






బులుసు వేంకటరమణయ్య

# లోక ధర్మాన్ని పాటించాలి

దుష్టులైన రాక్షసులు జన్మాంతరంలో క్రూరులైన రాజులుగా పుట్టి ప్రజలను నానా కష్టాలూ కలిగిస్తూ వుండగా, వారి భారం మొయ్యలేక భూదేవి మహావిష్ణువుతో మొరపెట్టుకొన్నపుడు, ఆయన, ఆమెకు అభయం ఇచ్చాడు, తాను కృష్ణుడుగా అవతరించి దుష్టులని సంహరిస్తానని. అలాగే శ్రీహరి శ్రీకృష్ణుడుగా అవతరించి తన ధర్మాన్ని నెరవేర్చుకున్నాడు.

యాదవ కులంలో ముసలం పుట్టి, తమూలంగా తనవారందరూ నశిస్తున్నప్పుడు శ్రీకృష్ణుడు తటస్థంగా ఉండిపోయాడనీ, కౌరవులకూ, పాండవులకూ పరస్పర విద్వేషం పెరిగి, మహాయుద్ధం సంభవించనున్నప్పుడు తాను రాయబారం వహించి యుద్ధాన్ని నిలిపి వెయ్యడానికి ఎంతో ప్రయత్నం చేశాడనీ, ఇట్టి వ్యత్యాస భావం అతనికి ఎందుకు కలిగిందనీ కొందరికి సందేహం కలగడం సహజమే!

యుద్ధం జరిగితేనేగాని దుష్ట నాశనం సాధ్యం గాదు. కాబట్టి యుద్ధం జరగవలసిందే అనీ, అది అనివార్యమనీ శ్రీకృష్ణునికి తెలుసును. అయినా అతడు సంధికోసం రాయబారం నడపడం లోకధర్మాన్ని పాటించడానికే! అతడు సాక్షాత్తుగా భగవంతుడే అని విజ్ఞులు భావించినా, అజ్ఞులు, అతడు సామాన్య మానవుడనే అనుకొన్నారు. ఇట్టి స్థితిలో ప్రజా సామాన్యానికి తనపై సదభిప్రాయం కలగడానికి ఆయన కౌరవ పాండవులకు సంధి కుదర్చడానికి యత్నించడమే ఉత్తమమార్గం. సంధి కుదరదని ఎరిగి కూడా లోక ధర్మాన్ననుసరించి ఆయన యత్నించాడు.

అయితే ఈ ప్రయత్నం తన వారి విషయంలో ఎందుకు చెయ్యకూడదూ? అంటే– దానికి సమాధానం లేకపోలేదు

మహామునుల శాపం కారణంగా యాదవుల నాశనం తప్పదని శ్రీకృష్ణునికి బాగా తెలుసును. మునులను అవమానించడంలో తన సంతానం ప్రధాన పాత్ర వహించినది అందువల్ల తాను ఏమి చెయ్యడానికీ సాధ్యంకాని పరిస్థితి ఏర్పడింది అయినా పూర్తిగా ఉపేక్షించలేదు పుట్టిన ముసలాన్ని పూర్తిగా అరగతియ్యాలని చెప్పి, అలా చేయించాడు చివరకు మిగిలిపోయిన ములికి వంటి దాని భాగమే ఆయన అవతారాన్ని చాలించడానికి కారణమున్నూ అయినది శ్రీకృష్ణుడున్నూ యాదవ వంశంలోనివాడే కదా మరి!

ఆయన భగవంతుడే అయినా, మానవుడుగా అవతరించినందున, మానవ ధర్మాలను పాటించక తప్పదు

---

వోడొకడు తిక్క తగే మారగం సూపించేడు. యెబిసేరంలో మజా తెల్సిన ఆ అలవాటు మానేదెలా బాబుగోరూ?

సేతిరిగారి బాధలు, సమస్యలు– అదిగో అప్పటి నా బాదల్లాంటివే. ఆరికి ఆరు కను క్కొన్న మారగాలు నాకు సెప్పినటువంటివే. నా కట్టాలు ఆనాడు తీరేయా? అలవాట్లు పెరిగేయి. నిషా పెరిగింది. బాదలు పెరిగినాయి నాకు ఆ అలవాట్లు సేసినోళ్లే నన్ను అసెయ్యించుకొంటున్నారు యియ్యాల.

నడిసికి బాదలు వొచ్చినప్పుడు 'నిసాలు' సూపి కొందరు మోసాలు సెయ్యొచ్చు. మరి కొందర్ని నిసాలే లాగెయ్యొచ్చు అట్టాగని నిసాలు మంచివంటారా ఏంటిబాబూ మీరు? విలుకలున్నాయని యిల్లు సిచ్చుపెట్టుకోటం ఏదర్మసేత్తరం ప్రకారం న్యాయంబాబయ్యా? జూదగోడిని, తాగుబోతుని, ముండలముటాకోరుని, దొంగని అవ్తేతే నా భాదలుతీరాయా? నిసాలు పెరిగేయి. సేత్తిరిగోరూ. మతం మార్పిడి కూడా ఓ నిసానేబాబూ! మొదట్లో హాయిగానే కనిపిత్తుంది కానీ దానివల్ల బాదలు తీరవు బాబూ! మీ బాదలు పెరుగుతాయి. ఆలోసించుకోండి'

ఆదెయ్య పై పంచె దులుపుకొని లేచేడు

'అదెయ్యా, తాత్కాలికమైన బాధకు భయపడి మౌలికమైన ధర్మాన్ని వదులుకొని పారిపోయే పిరికితనం నాలో పెరిగాల్టేవు ఆదెయ్యా! నా నిషాను నీ 'నిషా కధ' తో వదిలించావు. నీకు కృతజ్ఞుడిని'

'తాగుబోతోడి నాలుగు మాటలకే మనసు మర్చుకొన్నారా సేత్తిరిగోరూ? అంటే మా వాడలో వోల్లకిలాగా మీ తలకి ఆ నిసా ఎక్కలేదన్నమాట!'

ఈలోగా లలిత మెల్లగా చైనులు దగ్గరికి వచ్చింది చేతిలో కవరును ముక్కలు కిందచించి ఆయన కాళ్ళపైన పోసింది

'మీరంతా నా బలహీనతను క్షమించండి తాతయ్యా' అని ఏడుస్తూ చైనులు కాళ్ళ మీద పడిపోయింది!

## ఇంటిదొంగ!

నామక్కల్లు (తమిళనాడు) కు చెందిన ఇల్లుపల్లిలోని వో కోపరేటివ్ బ్యాంకులో పనిచేస్తున్న కందసామి బ్యాంకు లాకర్లలోంచి 375 కాసుల 103 బంగారు ఆభరణాలు ఎవరో కాజేశారని బ్యాంకుకు రిపోర్టిస్తే వారు పోలీసులను పిలిచారట. లాకర్ బద్దలు కొట్టి లేనందున ఇదేదో ఇంటిదొంగ పనేనని అనుమానించి పనివారందరినీ విచారించనారంభించితే ఈ కందసామి నీళ్లు నమిలాడట. టలాయిస్తే ఆతను సేలంలో ఉన్న తన మామగారి సహాయంతో యీ నగలు తస్కరించి నట్లు తేలిందట మాంగారీ నగలను సేలంబజారులో పట్టికున అమ్మజూపుతూ దొరికిపోయాడట. మొత్తం ఆ నగల వెల నాలుగు లక్షల ఇరవై ఐదు వేల ఐదొందుల ఎనిమిది రూపాయలట.

## చిత్రహింసలో కొత్తపుంతలు!

మధ్యప్రదేశ్‌కు చెందిన బత్తూర్‌పూరు గ్రామానికి చెందిన పోలీసులు నేరస్తులను వో వింత పద్ధతిలో శిక్షిస్తున్నారట. ఈపద్ధతికివారు "లక్ష్మన్ జూలా" అని పేరుపెట్టారట. దీని ప్రకారం వారు నేరస్తుణ్ణి దూలానికి తలక్రిందులుగా వేళ్లాడదీసి, ఆతని చేతులు వెనక్కి విరిచి కట్టేస్తారట. ఆనక అతని అరికాళ్లమీద లాఠీలతో బాదుతారట. అలా తలక్రిందులుగా కట్టేముందు ఆ నేరస్తుణ్ణి దిగంబరుణ్ణి చేస్తారట. వారికి ఇంకా కసి తీరక పోతే చివరికి నేరస్తుని జననాంగానికికరెంటువైరులు చుట్టి, షాకులివ్వనారంభిస్తారట నేరస్తుడు విల విల్లాడి పోతూంటే పోలీసులు ఆనందంలో వికవిక లాడిపోతూంటారట జననాంగానికి ఈ రకంగా షాకు తగిలించడం వల్ల వారు పుంసత్వాన్ని కోల్పో తారట. ఈ విధంగా ఆ వూరు పోలీసు సుమారు 13మందిని నపుంసకులు చేసి మరీ వదిలేశారట. ఇందులో కొందరు విద్యార్థులుకూడా ఉన్నారట.



ఈ పోలీసు చర్య, భాగల్పూరు పోలీసులు నేరస్తుల కళ్లు పీకిన చర్యను మించిపోయిందని పత్రికలు గోల చేస్తున్నాయి.

## నిర్లక్ష్యానికి నిండుప్రాణం బలి!

ఢిల్లీ హిందూరావు ఆసుపత్రిలో పని చేస్తున్న డాక్టర్ రామ్‌ప్రసాద్‌ఘోష్ జనవరి నెలలో వో రాత్రి ఆసుపత్రి నుండి ఇంటికి బయలుదేరి రోడ్డు దాటుతూండగా వో వాహనం ఆయన్ని ఢీకొందట. తలకు గాయాలై ఆసుపత్రిపాలై సుమారు పాతికవేలు ఖర్చయ్యాక, మనిషి దక్క కుండా పోయాడట. దాంతో ఆయన భార్య 46 ఏళ్ల జూరానా ఘోష్ తన 14ఏళ్ల ఏకైక పుత్రుడు అభిర్‌ను పోషించడానికి ఏదైనా ఉద్యోగం దొరుకుతుందేమోనని విశ్వయత్నం చేసిందట. చనిపోయిన భర్త జీవితభీమా డబ్బుగాని, ఆయనకయిన వైద్య ఖర్చులలో తిరిగి ఇవ్వాల్సిన డబ్బుగానీ (రీయింబర్స్ మెంట్) రాలేదట. ఎన్నిసార్లు ఆయా అధికారుల వద్దకు వెళ్లి ప్రార్థించినా పనులు జరగలేదట నా అన్నవాళ్లెవరూ ఆమెను ఆదుకోలేదట. తెలిసిన వాళ్లు అయ్యో నెత్తిమీద గొడుగు లేకుండా బ్రతకడం కష్టమని ఆమెను నిరుత్సాహపరచనారంభించారట. దాంతో ఆమెకు జీవితంమీద రోత పుట్టి నిద్ర మాత్రలు తాను వేసుకుని, కొడుక్కూ, ఇంటి కుక్కకూకూడా వేసిందట అక్టోబరు 26వ తేదీన ఆనక ఆసుపత్రిలో ప్రాణాలకోసం జరిగిన పోరాటంలో ఆమె అక్టోబరు 30 వ తేదీన పోయిందట. కొడుకూ కుక్కా తేరుకుంటున్నారట.

## అశ్లీలతకి పముఖుల అండ!

బూతుబొమ్మలు పోటోలు తీయడానికి, బూతు సినిమాలు తీసి ధనికులకు అమ్మడానికి ప్రత్యేకంగా భారతదేశపు అమ్మాయిలు ఎక్కువగా ఉపయోగపడుతున్నారట. ప్రపంచమంతటా ఈ పోటోలకూ, సినిమాలకూ మనదేశపు అమ్మాయిలకు మాంచి గిరాకీ ఉన్నదట తత్ఫలితంగా మనదేశపు అమ్మాయిలు అనేకరకాలుగా విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నారట. రానురాను యీ బూతు వ్యామోహం ఎక్కువయిపోతోందని బ్రిటన్ పౌరులలో యాభై లక్షలమంది మహజరుమీద సంతకాలు పెట్టి లక్కడి ప్రభుత్వానికి సమర్పించారట. డాక్టర్ జగ్గర్ అనే వో బ్రిటీష్ దేశస్తుడు బంగ్లాదేశ్ నుంచివస్తూన్న అమ్మాయిల రాకెట్లకు బంగ్లాదేశ్‌లో పెద్దపెద్ద ప్రముఖులూ, రాజకీయ వ్యక్తులూ తెర వెనుక బలమని వివరించారట. న్యూయార్క్ టైమ్స్ పత్రికయీ విషయాలమీద సువిస్తారంగానూ, దారుణంగానూ వివరాలు ప్రకటించి, ప్రజలను మేలుకోమన్నదట—

## పెళ్లయ్యాక తగ్గిన ధూమపానం!

నటుడు రజనీకాంత్ వివాహానికి ముందు రోజుకు ఎంత లేదన్నా అరవై సిగరెట్లు దగ్ధం చేసి పారేస్తూ ఉండేవాడట. పెళ్లయ్యాక ఈ సంఖ్యను దినదినంగా క్షీణింప చేస్తూ వచ్చారట.

## అనుమతి ?!

సెప్టెంబరు 15వ తేదీ మత కలహాల ఫలితంగా జహిరాబాద్‌లో జరిగిన ల్లూరులను గురించి సయ్యద్ అఫిజల్ మెహిద్ అనే 28 ఏళ్ల యువకుడు తాను సొంతంగా నడుపుతున్న 'అయినా—ఏ—పీసత్" అనే పక్షపత్రికలో వివరంగా రాశారట. దాంతో జహిరాబాద్ ఎస్.ఐ మిస్టర్ సత్యనారాయణ అతన్ని పిలిపించి చెడ్డ చివాట్లు పెట్టి, పోలీసులను గురించి రాసేటపుడు ముందు ఆ వ్యాసం ప్రచురణకు తన అనుమతి పొందాలని ప్రకటించి పొమ్మన్నారట. మళ్లీఅక్టోబరు నాలుగో తేదీన స్టేషనుకు పిలిపించి తానూ, సర్కిలిన్‌స్పెక్టరు అజిజుకలసి మరిన్ని తిట్టి పంపారట. మళ్లీ 5వ తేదీన పోలీసులాతని ఇంటిమీదపడి, మెహిదికి సంకెళ్లు వేసి పోలీస్టేషనుకు లాక్కుపోయారట. ఆనక సాయంత్రం అయిదింటికి కోర్టులో హాజరుపరిస్తే అక్కడి మున్సిఫ్ మేజిస్ట్రేటు అతన్ని 17వ తేదీవరకూ జైల్లో ఉండేలా ఏర్పరిచారట. ఆనక బెయిలుమీద విడుదలచేశారట.

## పెళ్లికోసం దొంగతనం!

కేన్‌పూలియూరుకు చెందిన రామయ్య అనే వో పెళ్లికొడుకు తన వివాహానికి డబ్బు లేక ఎంహూర్తం అతి దగ్గరపడుతూండడం చూసి, తెగించి, తెల్లారితే పెళ్లనగా మెల్‌పూలియూరు వెళ్లి అక్కడో ధనవంతుడు సుదలైముత్తుదేవర్ అనే అతని ఇంట్లో జొరపడి, బీరువా పగులేసి ట్రాన్సిస్టరు ఎత్తుకు పోయి, బజారులో అమ్మజూపుతూ పట్టుపడిపోయాడట.



# వంటలు



## సగ్గుబియ్యం హల్వా

కావలసిన వస్తువులు : సగ్గుబియ్యం — 1 గ్లాసు, పాలు — 2 గ్లాసులు, నీళ్లు, 1 గ్లాసు, చక్కెర — 1 గ్లాసు.

తయారుచేయు విధము : మంచి నేతిలో సగ్గుబియ్యమును కొద్ది కొద్దిగా వేయించుకోవాలి ఇవి బాగా పొంగుతాయి గిన్నెలో నెయ్యివేసి, జీడిపప్పు ముక్కలు వేసి ఎర్రగా అయిన తరువాత పాలు, నీళ్ళు కలిపినది వేసేది. మరిగిన తరువాత సగ్గుబియ్యం వేయాలి లోపల బియ్యం కనిపించినంతగా బాగా ఉడకాలి. ఎన్నువి మంట అవసరం. నీళ్ళు తక్కువైతే కొన్ని చల్లుకోవాలి. చక్కెర వేసి, మిశ్రమము అడుగంటకుండా కలియబెట్టాలి. నెయ్యి పూసిన ప్లేటులో కొన్ని వేసి చల్లారిన తరువాత ముక్క వచ్చేటట్టుగా చూసుకోవాలి అలా తయారవగానే పెద్ద ప్లేటులో నెయ్యి రాచి, అంతావేసి, సమంగా సర్దాలి వేడిమీదనే పచ్చికొబ్బరి కొంత వేసి అలా అద్దాలి మరల పైన మనకు కావలసిన 'డ్రై ఫ్రూట్స్' రకాలు చల్లుకోవచ్చును. ముక్కలు కోసి వుంచుకోవాలి

ఇది రెండు రోజుల కంటె నిలువ వుండదు.

— కె. సునందాభార్గవి

## చౌమీన్

కావలసిన వస్తువులు న్యూడిల్స్ — 1 ప్యాకెట్, [దీంట్లో ఎగ్‌వి వుంటాయి, మామూలివి వుంటాయి], బంగాళా దుంపలు — 2, క్యారెట్లు - 2, కాలీఫ్లవర్ గుత్తులు—8లేక 10, బీన్స్ 10 లేక 15, పచ్చి బఠాణి గింజలు - కొంచెం, ఉల్లిపాయలు — 2, పచ్చిమిర్చి - తగినన్ని, వాముపొడి — 1 చిన్న చెంచా, నెయ్యి

చేయువిధము : కూరలు అన్ని ఒకే సైజులో తరగాలి ఉల్లిపాయలు, మిర్చి, సన్నగా పొడుగ్గా తరగాలి. న్యూడిల్స్ తుంపుకుని నీటిలో ఉడికించి జల్లెడలో వేసి చన్నీళ్ళు పోసి చల్లారపెట్టి విడిగా వుంచాలి కూరలు కూడా రెండు పొంగులు రానిచ్చి చల్లారపెట్టి వుంచుకోవాలి బాణలిలో తగినంత నెయ్యి వేసి ఉల్లిపాయలు మిర్చి, కూరముక్కలు వేసి ఎర్రగా వేయించాలి వేగాక వుడికిన న్యూడిల్స్ వేసి ఇంకో పది నిముషాలు వేయించాలి ఇప్పుడు ఉప్పు, వాముపొడి, కొద్దిగా పసుపు వేసి పది నిముషాలు సన్నటి సెగమీద మూత పెట్టి ఉంచాలి ఇంకోసారి కలియపెట్టి సెగతీసి వేరే గిన్నెలోకి తీసుకోవాలి ఇది ఏ సాస్‌తో అయినా తింటే బాగుంటుంది

— మాగంటి రాణి

## మిల్క్ జామూన్

కావలసిన వస్తువులు . పాలు రెండు లీటర్లు, చక్కెర 400 గ్రాములు, మైదాపిండి ఒకకప్పు, నెయ్యి తగినంత, కొద్దిగా కేసరిపౌడర్, బాదాం పిసెన్సు

తయారుచేయు విధము ముందుగా ఒక వెడల్పుమూతిగల పాత్రలో పాలను తీసుకుని పొయ్యిపై పెట్టాలి పాలని గరిటతో అపుడపుడు కలియపెడుతూ వుండాలి బాగా చిక్కపడి దాదాపు సగం అంటే ఒకలీటరు అయ్యాక దించెయ్యాలి. తర్వాత చక్కెరలో తగినంత నీరుపోసి పొయ్యిపై పెట్టి పాకం తయారు చెయ్యాలి,దానిలో కొద్దిగా కేసరి పౌడర్, బాదాం ఎసెన్సువేసి కలిపి దించేసి పెట్టుకోవాలి ఇపుడు ఇగురపెట్టిన పాలలో మైదాపిండినిపోసి ఉండలు కట్టకుండా బాగా కలపాలి ఈ మిశ్రమం గరిట జారుగా వుండాలి. మరీ పలుచగావుంటే మరికాస్త మైదాపిండి కలుపుకోవచ్చును. బాణలిలో నెయ్యితీసుకుని మరిగాక పాలు- మైదా మిశ్రమాన్ని చెంచాతోపిండి, జామూన్‌లా వెయ్యాలి వేగాక తీసి పంచదార పాకంలో వేయాలి.

—గార్లపాటి సరస్వతి

### రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన అందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం.








అసలు మగ దోమలు మనుష్యుల్ని కుట్టవన్న విషయం మీకు తెలుసా? నిజానికి కుట్టే దోమలు ఆడ దోమలే మరో విషయమేమిటంటే ప్రాణాంతకమైన మలేరియా, విష జ్వరంలాంటి వాటిని రప్పించే క్రిములను మోసుకుపోయేవి కూడా అవే అలాంటి దోమ ఒక్కసారి కాటేస్తే చాలు అది మీకూ మీ కుటుంబానికి ప్రాణంమీదకు తేవచ్చు

అందువల్ల మరి మీరేంచేయాలంటే—
3BN రిపెల్లెంట్‌తో కూడి మెరుగుపరచబడిన ఓడోమాస్‌ను తెచ్చుకోండి దానిని మీ శరీరంలో కప్పబడని భాగాలపై అలా వ్యానిషింగ్ క్రీమ్ రాసినట్టు రాయండి. పసి పాపల సున్నితమైన చర్మంపై రాసేందుకు కూడా ఇది ఎంతో సురక్షితమైనది నేడే ఓడోమాస్ తెచ్చుకోండి. రాత్రంతా హాయిగా నిద్రపొండి

ఇప్పుడు 100 గ్రా. ఏకానమీ ప్యాక్‌లో కూడా దొరుకుతుంది.

ఓడోమాస్ దోమల్ని దూరంగా ఉంచుతుంది.




CHAITRA-BLS-438 R TEL

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## శ్రీమతి సుబ్బులక్ష్మికి ఆస్థాన విదుషీమణి పదవి :

విశ్వవిఖ్యాత గాయని శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మిని రాష్ట్రప్రభుత్వం "ఆస్థాన సంగీత విదుషీమణి" పదవితో గౌరవించింది. ఈ గౌరవం నవంబర్ 28న రవీంద్రభారతిలో సాంస్కృతిక శాఖా మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి అధ్యక్షతన జరిగిన సమావేశంలో జరిగింది. ముఖ్య అతిథిగా వచ్చిన ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య శ్రీమతి సుబ్బులక్ష్మిని సంగీత సరస్వతిగానూ, సంగీత లక్ష్మిగానూ అభివర్ణించారు. విద్యా, సాంస్కృతికశాఖా కార్యదర్శి శ్రీ మామిడిపూడి గోపాలకృష్ణ ప్రశంసా పత్రం చదివారు. శ్రీమతి సుబ్బులక్ష్మి, ఆమె కుమార్తె శ్రీమతి రాధ భక్తి కీర్తనలు ఆలపించారు. ఈ అమరగాయని గానం విన్నప్పుడు, ఆమెగానం వినడానికి జాతరగా వచ్చే జనాన్ని చూచినప్పుడు నాకు ఎన్నో పాత విషయాలు జ్ఞాపకం వస్తాయి. నాలుగు దశాబ్దాల క్రితం ఆమె శ్రీనివాసన్ నిర్మించిన భక్త కుచేల తమిళచిత్రంలో తొలిసారిగా కృష్ణ పాత్ర ధరించినప్పుడు జనం విరగబడి చూచారు. దానిలో సుప్రసిద్ధ తమిళ వాగ్గేయకారుడు శ్రీ పాపనాశం శివన్ కుచేలుడు. 1946లో ఆమె పాండుచ్చేరిలో అరవిందాశ్రమంలో కచేరి చేసినప్పుడు పదివేలకు పైగా శ్రోతలున్నారు. ఆమె మిత్రరాజ్యసమితిలో పాడినా, ఇంగ్లాండులోని ఎడిన్‌బరో సంగీతోత్సవంలో పాడినా, మద్రాసు మ్యూజిక్ ఎకాడమీలో పాడినా, న్యూయార్క్‌లో పాడినా శ్రోతల సంఖ్య, ఆమె గాన ఫణితి, ఒకే శ్రోతల సంబరం. ఆమె వెంకటేశ్వర సుప్రభాతం ఎల్ పి రికార్డులు తిరుమల తిరుపతి దేవస్థానానికి ఐదు లక్షల రూపాయలు సంపాదించింది. ఇతర రికార్డుల ఆదాయం విద్యాభవన్‌కు, రామకృష్ణ మఠానికి ఏడెనిమిది లక్షలు చేకూర్చింది. భారతప్రభుత్వం 1954లో ఆమెను పద్మభూషణతోను, 1956లో రాష్ట్రపతి అవార్డుతోను గౌరవించింది. మద్రాసు మ్యూజిక్ అకాడెమీ ఆమెను 1968లో అధ్యక్ష పదవితో గౌరవించి, సంగీతకళానిధి బిరుదునిచ్చింది. 1974లో రామన్ మెగసెసే అవార్డు, 1975లో పద్మవిభూషణ్ బిరుదు, మరెన్నో బిరుదులు ఆమెను వరించాయి. ఆమె కస్తూర్బా స్మారక నిధికి (1944) మరెన్నో ధర్మ కార్యాలకు సంగీతంతో అపార నిధులు సేకరించింది. ఈ శ్రేయస్సుకంతా కారణభూతుడైన ఆమె భర్త శ్రీ టి. సదాశివన్ అభినందనపాత్రుడు. ఆయన సంస్కార వివాహంతో ఆమెను సాంఘికంగా ఉన్నతస్థితికి తెచ్చారు. శ్రీమతి సుబ్బులక్ష్మి 1916 సెప్టెంబరు 16న మధురైలో జన్మించింది. తల్లి శ్రీమతి షణ్ముగవడివు గొప్ప వైణికురాలు. భాషా దేశాలకు అతీతమైన సంగీతానికి అంకితురాలైన శ్రీమతి సుబ్బులక్ష్మిని రాష్ట్రప్రభుత్వం భాషా దేశ కాలాల ప్రసక్తి విడనాడి గౌరవించడం ప్రశంసనీయం.

## ఎర్రన ఆడిటోరియం కోసం మొర :

ప్రాచీన కవుల పట్ల నేడు ఆదరాభిమానాలు ఎక్కువవుతున్నాయి. దానికి తార్కాణాలుగా వివిధ సంస్థలకు ప్రాచీనకవి పండితుల పేర్లు పెట్టడం రంగస్థలాలకు, క్రీడాంగణాలకు వారి పేర్లు పెట్టడం మొదలైన ప్రక్రియలను చెప్పవచ్చు. బమ్మెర పోతన్న సంస్మరణార్థం నెలకొల్పదలచిన భవన సముదాయం రూపురేఖలు ఎలా ఉండాలనే విషయం పరిశీలించడానికి రాష్ట్రప్రభుత్వం సాంస్కృతిక శాఖ సంచాలకులు డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావును, సమాచార శాఖ సంచాలకులు శ్రీ మాణిక్యాలరావును విదేశాలకు పంపడం, వారు విదేశాలలోని మహాపురుషుల సమాధులను, స్మారక భవన స్తోమాలను చూచి రావడం ఆంధ్రావళికి తెలుసు. తెలుగు కవిత్రయంలో ఒకడైన ఎర్రా ప్రగడకు కూడ ఆయన తన జన్మస్థలమని చెప్పుకున్న గుడ్లూరులో ఒక స్మారకం నెలకొల్పవలసిందిగా గుడ్లూరు వాసులు రాష్ట్రప్రభుత్వాన్ని కోరారు. ఎర్రన పేర గుడ్లూరులో ఒక ఆడిటోరియం నిర్మించమని, అది ప్రకాశం జిల్లా వారందరికీ ఉపయోగకరంగా ఉంటుందని వారు ప్రభుత్వాన్ని వేడుకున్నారు. ఆడిటోరియం నిర్మాణం ప్రస్తుతం ఫిలిం కార్పొరేషన్‌కు సంబంధించింది గనుక దానిని కూడా అభ్యర్థించారు. కొన్నేళ్లుగా చేస్తున్న ఈ విజ్ఞాపనలన్నీ అరణ్యరోదనమయ్యాయని శ్రీ గుడ్లూరు నరసింహారావు తెలుపుతున్నారు. ఆ ఆడిటోరియం ఖర్చు సభలలో మంత్రులకు, తప్పిన పెద్దలకు వేస్తున్న దండల విలువ కూడా ఉండదని ఆయన వాదం. శ్రీ నరసింహారావు ఒకప్పుడు రైల్వే ఆడిట్ సెక్షనులో సూపరింటెండెంట్.

**చాంగు బళా శ్రీకాంత్ :**

నల్యాణలక్ పేటలోని "అభినయ దర్పణ" కూచిపూడి నాట్య పాటశాల ద్వితీయ వార్షికోత్సవం సందర్భంగా రవీంద్రభారతిలో డిశంబరు 6వ తేదీన జరిగిన సమావేశం బాలబాలికలలో అంతర్నిహితమైన శక్తి, కొద్దిపాటి ప్రోత్సాహంతోనైనా ఎంతో వెల్లుబుకగలదో నిరూపించింది. నాట్య పాటశాల స్థాపించి రెండేళ్ళయినా బాలబాలికల శక్తిని ఉద్దీప్తం చేయగలగడం అత్యంతం ప్రశంసనీయం. కూచిపూడి, దేవాలయనృత్యాలలో ప్రత్యేకకృషి చేసి గుజరాత్‌లో విశేషంగా ప్రచారం చేస్తూ, అనేకానేక శిష్య సంతతిని పెంచుతూ, గుజరాత్. కేంద్ర ప్రభుత్వాలతో పలు సన్మానాలు పొందిన ప్రసిద్ధ నాట్యాచార్యులు శ్రీ సి. ఆర్. ఆచార్య కుమార్తె శ్రీమతి వి. రంగమణి నిర్వహణలో ఉన్న 'అభినయ దర్పణ' నాట్య పాటశాల ముందు ముందు గొప్ప నృత్య నిపుణులను రూపొందించగలదని అనడానికి చిరంజీవి శ్రీకాంత్ ఒక్కడే చాలు. శ్రీకాంత్ అంగవిన్యాసాలు, విక్షేపాలు, గతులు, హావభావాలు, శరీర సౌష్ఠవం అతడొక గొప్ప నటుడు కాగలడని సాక్ష్యమును ఇస్తున్నాయి. సింహనందిని అనేది శైవ దేవాలయాల నృత్యాలలో ఒకటి. దీనిలో నృత్యకారుడు భద్రకాళిగాను, ఆమెకు వాహనమైన సింహంగాను. ఆమె సంహరించే రాక్షసులుగాను త్రిపాత్రాభినయం చేయాలి. పది సంవత్సరాల చిరంజీవి శ్రీకాంత్ సింహనందిని నృత్యాన్ని అభినయించడంలో మూడు పదుల యువకుడుగా, ఐదు పదుల నాట్యాచార్యుడుగా కనిపించాడు. అతనికి గొప్ప భవిష్యత్తు ఉంది. తక్కినవారిలో కుమారి రాజేశ్వరి మండోదరి శపథాన్ని, కుమారి లలిత బాలగోపాల తరంగాన్ని, కుమారి అభిలాష సర్పనృత్యాన్ని బాగా అభినయించారు. ఈ సందర్భంలో నాట్యాచార్యులు శ్రీ సి. ఆర్. ఆచార్యను, శ్రీ నటరాజ రామకృష్ణను సన్మానించారు.

**ఉపశ్రుతి :**

చూశారా ఆంధ్రప్రదేశ్ మరొక విషయంలోను తురాయి తగిలించుకుంది— అన్నారొక మిత్రులు. దేనిలో?— అన్నాను. వెట్టి చాకిరీలోనండి!— అన్నారు ఆయన. మంచికో, చెడ్డకో పేరు మోగడం మంచిదని చెప్పిన అన్నాడు గదా!— అన్నారు మరొకరు.

## లోకంపోకడ * ఊరిమెన్




# ఉత్తరాలు

(4వ పేజీ తరువాయి)

### కథలు

18 12 81 తేది నటి అంబిక ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో పెళ్లి చూపులు మరియు దేవతా వస్త్రాలు కథలు చాలా బాగున్నవి

పెద్దిరెడ్డి శశిధర్ (మచిలీపట్నం)

*    *    *

ది 18 12 81 వారపత్రికలో 'దేవతా వస్త్రాలు' కథ సాహిత్యపరంగా ఉన్నతంగా ఉంది చక్కని శైలి, ఒక్కొక్క పాత్రతోను పరిధులు దాటకుండా పలికించిన మధుర భాషణలు రచయిత సామర్థ్యాన్ని చూపాయి

'రావు'గారు ఆ కథకు గీసిన చిత్రం చాలా అందంగా ఉంది

బి సన్యాసిరాజు (మదరాసు)

*    *    *

నటి అంబిక ముఖచిత్రముతో వెలువడిన 18 12 81 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎంతో బాగుంది పెళ్లిచూపులు, దేవతా వస్త్రాలు కథలు చాల బాగున్నాయి.

బి జంగమయ్య (సోంపేట)

### ఊమెన్ కార్ట్యూన్స్

దక్షిణాది డ్రీమ్ గర్ల్ అంబిక ముఖచిత్రం విడుదలైన ఆంధ్ర సచిత్ర వారపత్రిక మమ్మల్ని ఎంతగానో ఆకర్షించింది. లోకంపోకడ కార్టూన్లు ఇప్పటి రాజకీయాలకు అనుకూలంగా ఉన్నాయి

పి. పాండురంగారెడ్డి (చిత్తూరు)

*    *    *

హరిత పత్రాలలో లేత పసుపు వన్నె ఛాయలో ఉన్న 'అంబిక' ముఖచిత్రారవిందంలో వెలువడిన 18.12 81వ తేదీ పత్రిక అమోఘం. 14వ పేజీ కార్టూన్ బాగానే నవ్వించింది కానీ గీసినవారు ఆ సిగరెట్‌ను "సప్లయింగ్ ట్రే" కిందిగా వేసి ఉంటే బాగుండేది. ఎంత పొగైతే మరీ అంత పబ్లిక్‌గానా! ఎనీహౌ ఏ గుడ్ కార్టూన్ ఇన్‌డీడ్

పెన్మెత్స సూరిబాబు (హైదరాబాదు)

### ధర్మపథం

4 12.81 వారపత్రికలో ధర్మపథం చాలా బాగుంటున్నది. రచయితకు మా ధన్యవాదాలు.

మీర్జా నల్లపరాజు బాలసరస్వతి (తుని)

---

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
S Radhakrishna.

# పాల్ నురుగల సైన్యం రావాలి! మురికిపై దాడిని చేయాలి!!




మురికి, జిడ్డు, మరకలపై పాల్ నురుగుల దాడి ప్రారంభం కానివ్వండి! పాల్ నురుగుల సైన్యాన్ని రంగంలోకి దిగనివ్వండి!!

మురికి, జిడ్డు మరకలతో ఇవి కలియబడడం చూడండి. వాటిని సమూలంగా నాశనంచేసి, తళతళలాడే స్వచ్ఛమైన తెల్లని బట్టలు మిగులుతాయి.




ఉత్పత్తిదారులు :
అల్ట్రా మరైన్ అండ్
పిగ్మెంట్సు లిమిటెడ్
రాణిపేట, తమిళనాడు

Sista s UPL-25A-81-Tel

రుచులూరించే 'ప్రియ'తో వినోద
యాత్రల కొక వినూత్నశోభ వస్తుంది.
పలురకాల కమ్మని రుచుల్లో 'ప్రియ'
పచ్చళ్ళు ప్రతిచోటా దొరుకుతున్నాయి.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300,
650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి

• మామిడికాయ • నిమ్మకాయ • టొమాటో
• అల్లం • గోంగూర • ఉసిరికాయ • చింతకాయ
• పండు మిరపకాయ • వంకాయ
తీపిరకాలు • మామిడికాయ • అల్లం




ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004